శ్రీరస్తు.

# యయాతి చరిత్రము,

పొన్నికంటి తె

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1930

# పీ ఠి క.

యయాతిచరిత్రము, అచ్చతెనుఁగుగ్రంథములలో మొద టిది యని యిందలి

క. "మున్నెవ్వరు నొడువని యీ, తెన్నిడి కడుమీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నికమీఱఁగఁ జెప్పిన, నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పయనన్."

అను 1 ఆ. 11 పద్యము తెల్పుచున్నది. దీనిని రచించిన కవి పొన్నికంటి తెలగనార్యుఁడు, తండ్రిపేరు భావనామాత్యుఁడు, నని గ్రంథముగద్య చెప్పుచున్నది. కాని, సూత్ర గోత్రములు చెప్పుటలేదు. నియోగిబ్రాహ్మణుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు నని కం. వీరేశలింగముపంతులుగారు వ్రాయుట కాధారము కనఁబడదు. తాను తెలగనార్యుఁడు, తండ్రి భావనామాత్యుఁడునఁట. ఇట్లు పూర్వకవులలోఁ గొందఱు వ్రాసికొనియున్నారు. ఈకవి తనగ్రంథమును అమీర్‌ఖానుఁ డను మహమ్మదీయప్రభువున కంకితముచేసెను. ఈయమీర్‌ఖానునకుఁ బలిరైన మల్కిభరామునకు అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును గృతియిచ్చెను. మల్కిభరాము ప్రభుత్వములో నమీనుఖానువంశస్థులు మూఁడుతరముల నుండి యుద్యోగులుగానున్నారఁట. (చూ. 1 ఆ 68 పద్యము) తెలగనార్యుఁడు యయాతిచరిత్రముకథ ప్రారంభించి యచ్చ తెనుంగుగ వ్రాయుచుండ నదితెలిసికొని యమీనుఖాను మఱింగంటి యప్పనగారిం బంపి చెప్పించి తనకుఁ గృతియిచ్చు నట్లు చేసికొనిరొనని

మ. "తనకున్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱఁగాఁ జల్లచూ
పున నెల్లప్పుడుఁ జూచి మన్నఁగల పెన్ప్రోడన్ మఱింగంటి య
ప్పనగారిన్ మదిలోనిమాట దెలియం బాటించుచుం గాంచినన్
గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా నన్ను మన్నించుచున్ (1-9)

ఆ. పిలిచి పొన్నిగంటి తెలగన్న నీ చేయు,నచ్చ తెనుఁగుఁగబ్బ మన్ని యెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి, పుడమిలోన సిరులఁబొగడుగనుము.
(1-10)

అనుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. తెలగన్నకుఁ బరిచయముగల యమీనుఖానుకొద్ది యుద్యోగియగు అప్పన్నగారే యీకబ్బమును అమీనుఖానునకుఁ గృతియిప్పించి కవికి ధనాదిక మిప్పించియైనయుండవచ్చును. సాధారణముగాఁ గావ్యములన్నియు నిట్లే యంకితమీయఁబడుచుండియుండును.

ఇక్కవి యచ్చతెనుఁగుకవిత్వము, "శ్రుతికటువుగాక మృదువుగాను బొందికగాను నున్నయది. ఇది యచ్చతెనుఁగు ప్రబంధములలో మేలైనదని తోఁచెడిని." అని శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులువారు తమశబ్దరత్నాకరములోఁ జెప్పియున్నారు. కం. వీరేశలింగముపంతులుగారు, "ఈకవికిఁ బూర్వమం దెవ్వరును శుద్ధాంధ్రభాషలో ప్రబంధము చేయుటకు ప్రయత్నించినవారైనను లేదు. ఇట్టిగ్రంథరచన కితఁడు మొట్టమొదటివాఁడే యైనను ఈకవి రచించినయయాతిచరిత్రము సర్వవిధములచేతను కూచిమంచి తిమ్మకవి రచించిన యచ్చతెనుఁగు పుస్తకములకంటె శ్రేష్ఠతరముగా నున్నదని నాయభిప్రాయము" అని వ్రాసిరి. కూచిమంచి తిమ్మకవి యీ తెలగన్న గ్రంథమును జూచియే తనరామాయణము ప్రారంభించెను. చూడుఁడు.

క. "తెనుఁగునను మాఱుపేళ్లిడి, పెనచిన విసఁగూడ దనుచు బిరుదులుఁ బేర్లన్
మును వేల్పుబాస వెంబడి,నునిచెడఁ గాదనకుఁడయ్య" (యయా.1ఆ.14ప.)

తే. "ఒనరఁ బేరులు బిరుదులుఁ దెనుఁగు సేయఁ
బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావునఁ గూరుపు మిదియు నట్టు." (అచ్చ తెనుఁగు రామాయణము.)

తెలగన్న ను గాంచి రచియించినను దిమ్మకవికవిత్వము వీరేశలింగము పంతులుగారికి శ్రేష్ఠముగాఁ గనఁబడలేదు. కవి యొక్క వాగ్విలాసాతిశయమే ముఖ్యముగాని మొదటి కవిత్వముచక్కఁగా నుండదు తర్వాతి కవిత్వము చక్కఁగానుండు ననుకొనుటలో సారము లేదు. తెలగన్నయుఁ బూర్వకవుల పద్యములు నూహాలు వర్ణనములుం దీసికొని యనేకవిధముల నచ్చ తెనుఁగు చేసికొని తన గ్రంథములోఁ జేర్చుకొనియున్నాఁడు. పింగళిసూరనార్యుఁడు, "రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గాకుండుఁ" ఇత్యాదిగా ద్వ్యర్థి కావ్యంబుం గూర్చి చెప్పియుండఁగాఁ దెలగన్న,

"అచ్చతెనుంగుఁబద్య మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగునన్నొడువ నందులచంద మెఱుంగువారు నిన్ మెచ్చరె"

అని చెప్పికొనినాఁడు. అనేకపద్యములు పాఠకులకుఁ జదువు నపుడు విదితమగునని యిందు వేఱుగఁ జూపలేదు.

యయాతిచరిత్రమను పేరేగాని కథ యంతయు నిందు లేదు. యయాతివివాహము దేవయాని శర్మిష్ఠలయందు సంతానము గనుట ఇంతవఱకే గ్రంథము గలదు యయాతికి శుక్రశాపాదు లిందుఁ దెల్పలేదు. మిగిలియున్న కథయే యెక్కుడని తోఁచుచున్నది. వేఁటవర్ణనము మనుచరిత్రములోవలె విశేషముగాఁ జేయఁబడియెను. వేఁటలో నొక్క లేడిని దఱుముకొని

యయాతి యొంటిగ జాబాలియాశ్రమమున కేగును. అజాబాలి "నీవొక్క మృగమునకై యిట్టియడవులకు రావచ్చునా? పూర్వము శ్రీరాముఁ డెంత మోసపోయినాఁడో యెఱుఁగవా" యని మందలించును.

"నావుడు నయ్యయాతి మదినాటిన ప్రేముడి ముజ్జగంబులం
బ్రోవఁగఁగావబీరమునఁ బొల్పగు రాముఁడు నట్టిబూమెచే
నేవగ మోసపోయె" (2 ఆ. 58 ప.)

అని రామకథ కొంత తెలిసియుఁ గొంత తెలియనివాని వలె నడుగును. ఇట్లే అనేకపర్యాయములు వేఁటలో వృష పర్వునిపట్టన సమీపమునకు వచ్చుచును, ప్రపంచజ్ఞానము లేని వానివలె "అతివ వృషపర్వుఁ డన నెవ్వఁ డతని యనుఁగుఁ గూఁతుపే రేమి" యని (3 ఆ. 50ప) ఘూర్జిక నడుగును. వృష పర్వుఁడును "కచుఁ డెవ్వఁ డని (3 ఆ. 105 ప) శుక్రు నడు గును. ఇవి యంత సరసముగాఁ గాన్పింపవు ఏది యెట్లున్నను ప్రస్తుతము మనకు యయాతిచరిత్రమువంటి కావ్యము లవస రమై యున్నవి.

ఆంధ్రభాషలో మన కిపుడు అచ్చ తెనుఁగుఁగబ్బములు యయాతిచరిత్రముగాక కూచిమంచితిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణము, నీలాసుందరీపరిణయమును, పాటిబండ పురు షోత్తమకవి కంసవిజయమును, అయ్యనకోట పార్థసారథిసెట్టి గారి సత్యవిజయము, రా. బ. కం. వీరేశలింగముపంతులుగారి శుద్ధాంధ్రభారతసంగ్రహమును, మచ్చ వెంకటకవి శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, కం. వీరేశలింగముపంతులుగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధమును, శ్రీ దేవులపల్లినరసింహ

శాస్త్రిగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనసారంగధరచరిత్రమును, దాసు శ్రీరాములుపంతులుగారి శుద్ధాంధ్రశాకుంతలనాటకమును గానఁబడుచున్నవి. పెక్కు లింకను సముద్రితములు గలవు గాని వాని నాదరించువారు తక్కువ.

ఈ తెలగన్నకవిత్వము బహురసవంతమైనది. మనోహారమైనది. పద్యములు చాలవఱకుఁ జదువుచున్నపుడు సాధారణముగా నిది శుద్ధాంధ్రమనుమాట కెడములేకుండ ధారాళముగా నుండును. ఇందును సామెతలు జాతీయములును సందర్భానుసారముగ వాడియున్నాఁడు.

"ఏచి నవిచి పూచి కాచి పండిన యమ్మి,న్పురము మేలితోఁట లరసి కాంచు

ముసలివారికైనఁ బసిబిడ్డలకునైనఁ, బండ్లువచ్చునలరుఁ బ్రాయ మొంది."
1-37

ఈరీతివి. 1. 42, 43, 45; 2 ఆ. 75-94, తృతీ. 15-101 పంచ. 14 మొదలగునవి గలవు. కవి యాంధ్రమహాభారతములోని యయాతిచరిత్రమునుజక్కఁగాఁ జదివియున్నాఁడనుటకు దృష్టాంతములు కలవు. "అనుఁగుఁజెలియఁబోలె నలరుఁదీవియ యూఁది నూతిలో వెడలిచి" మున్నగునవి చూడఁదగును. కొన్ని కొన్ని విశేషములను పుటలయడుగుభాగమునఁ జూపియున్నాము.

ఔర యవ్వింటికి నబ్బులల్లిబలువింటికిఁ గీలది యేమి గల్గెనో (1 ఆ. 59.) ఇట్టిపద్యమును బాలకు లింకొకగ్రంథములోఁ జదివియున్నారు. తలంచినంతనే జ్ఞప్తికిరాఁగలదు.

తెలగన్న కవి అమీనుఖాను నొద్దివాఁడు. అమీనుఖాను మల్కిభరాము నొద్దియుద్యోగి. మల్కిభరాము గోలకొండ నవాబులలో మూఁడవవాఁడు. అతఁడు క్రీ. శ. 1550-1581 వఱకు రాజ్యము చేసెను. అమీనుఖానుకుమారుఁడు ఫాజిలషా సిరంగరాయలకడ కేగినట్లు గ్రంథములోఁ దెల్పఁబడియున్నది. తిరుమలదేవరాయలకుమారుఁడు శ్రీరంగరాయలు క్రీ. 1574-1585-వ సంవత్సరమువఱకు రాజ్యము చేసినాఁడు. కావున, యయాతిచరిత్రమును గవి యాకాలములో నెప్పుడో చేసియుండును. "శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చినతర్వాతను ఇబ్రహీంషామరణము పొందకమునుపును (1574-1581 సం॥ మధ్య కాలమున) రచియింపఁబడినట్లు నిశ్చయముగాఁ దెలియవచ్చుచున్న"దని. వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి

స్థాలీపులాకన్యాయమున మే మీగ్రంథముంగూర్చి ముచ్చటించినారము. విశేషములు వేత్తలు గ్రహింతురని యింతతో విరమించుచున్నాము.

ఈగ్రంథమును ముద్రించుటకు మాకు గోదావరిజిల్లా పిఠాపురముడివిజను చెందు త్రిగ్రామములోని క్రొత్తపల్లి గంగయ్యగారువ్రాసికొనిన తాళపత్రగ్రంథమునుండి ఆంధ్రసాహిత్య పరిషద్ద్వారమునవచ్చిన కాగితపుఁబ్రతియుఁ బూర్వము రాజమహేంద్రవరములో ముద్రింపఁబడిన ప్రాఁతయచ్చుపుస్తకమును నాధారములయినవి. అనివార్యములగుతప్పు లక్కడక్కడ ముద్రణములో దొరలినవి. పాఠకులు తప్పొప్పుల పట్టికఁజూచి సవరించుకొనఁదగును.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

శ్రీరస్తు.

# యయాతిచరిత్రము

## ప్రథమాశ్వాసము.

చ. సిరులవెలుంగుబోఁడి తనచెక్కులు సిబ్బెపుగబ్బిగుబ్బలున్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నల్వఁ దలంచి కేలుఁదా
మరఁ గుదికిన్ను మాయుటను మాటికి నవ్వెడు వెన్నుఁ
డింపుతోఁ, గనుగొనుచుఁ బ్రోచుఁగావుత మదిం జెలరేఁగి
యమానుషానునిన్. 1

వ. అని యిచ్చం జెలంగు జేజేదొరం దలంచి యచ్చతెనుంగుఁ
గబ్బం బొక్కటి యొనరింపం దలంచి యున్నయెడ. 2

సీ. తెఱగంటిదొరరాలతెగలఁ దీఱినకోట
నిగనిగల్ నలుగడల్ నిండియుండఁ
దమ్ములవిందు రాకొమ్మలదగదగల్
వేలుపుఁబ్రోలిర్లు విరియఁజేయఁ
గొత్తడంబుల కెంపుక్రొత్తడంబులరంగు
నింగికిఁ దోఁపు వన్నియలు నింపఁ.
గడలి యాసని చిల్వఱేఁడఁతిచాలగడిత
తెలినీటి నేప్రొద్దుఁ గలసియుండ

తే. మిసిమిబంగారుమేడలమీఁదియెడల
నిడినముత్యాలుఁ జుక్కలుఁ దడఁబడంగఁ
దెలియ కెల్లరు వెఱఁగంద నలరు నెపుడు
మేలువడ్డిగమికొంద గోలకొండ. 3

క. ఆవీడేలుట సొబగుల
పూవిల్తుఁడు నిచ్చు చాగపుంబులి యనఁగా
దీవులకుఁ బాదుసాలకు
దేవర యిభరాముశాహు తే జడరంగన్. 4

చ. దురమున నోడిపోయి మఱి త్రోవలుగానక మార్తు రెంత
నే, ర్పరు లిభరాముశాహువు తిరం బగునండను జేరి
తొంటయ, చ్చెరువగుసొమ్ము రంకోమరుచేఁ గడు మొ,
క్కులఁ గాంతు రౌఁగదా, వెరవరు లైనవారలకు వింత
యె యాసిరు లెందు నుండినన్. 5

సీ. తెలివిసింగంపుగద్దియల రాతెఱఁగంటి
దొర లెల్ల మోడ్పుఁజేతులనె కొల్వఁ
బూని యేఁబదియాఱుమానిసి నెలవుల
పుడమితేం ద్లాడిగంబులకుఁ జొరఁగ
లీవి మున్నీటిలో దీవు లన్నియు నేలు
మన్నీలు మెట్టుఁదామరల కెరఁగఁ
దనతేజు సుడిగట్టు వెనుకచీఁకటి నెల
విరియించు తమ్ములవిందుగాఁగ
తే. వెలయు మలికిభరామునుఁ గొలిచి మనుచుఁ
గలనఁ దనచెయ్యి మీఁదుగాఁ గడిమి మెఱసి

మేలు సిరులందునట్టి యమీనుఖాన
యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున. 6

చ. పొలఁతుల్ చుట్టలు రాయబారులు దొరల్ ప్రోడల్ చె
లుల్ మన్నె వా, రలు మావంతులు దీవులేలుబలియుల్
రౌతుల్ మొదల్గాఁదనుం, గొలువన్ సంతసమంది కబ్బములు
పేరోక్క వించుఁ బిల్పించి న, న్నలరంగాఁ దనదండ నుంచు
కొని నెయ్యంబొప్ప మన్నించుచున్. 7

క. కలపము చేసిన గందం
బలఁదించిన వెనుక వన్నియలపచ్చడముల్
పలుమానికములసొమ్ములు
బలుతేజీ లిచ్చి కూర్మి పైపైఁ బర్వన్. 8

మ. తనకున్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱఁగాఁ జల్ల
చూపున నెల్లప్పుడుఁ జూచి మన్నగలఁ బెన్పొప్పిడన్ మరిం
గటియప్పనగారిన్ మదిలోనిమాట దెలియం బాటించుచుం
గాంచినన్, గని యామేటి తలం పెఱింగి పొసఁగంగా
నన్ను మన్నించుచున్. 9

ఆ. పిలిచి పొన్నికంటి తెలగన్న నీచేయు
నచ్చతెనుఁగుఁగబ్బ మన్నియెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడు గనుము. 10

క. మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిడి కడుమీఱి యచ్చతెనుఁగుంగబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁగలఁడె నెలతాల్పయినన్. 11

ఉ. అచ్చ తెనుంగుఁబద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రని యెన్నుచు నేర్పునఁ బొత్త
మెల్ల ని, ట్లచ్చతెనుంగున న్నొడువ నందుల చంద
మెఱుంగువారు నిన్, మెచ్చరొ యబ్బురం బనరొ మే
లనరో కొనియాడరో నినున్. 12

క. అనవుడు బళి నాకబ్బం
బునకున్ తేఁ టబ్బెఁ దావి పుత్తడికిం గ
ల్గినఠీవి ననుచు మదిలో
నను సంతసమంది కూర్మి నన లెత్తంగన్. 13

క. తెనుఁగునను మాఱుపేళ్ళిడి
పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులుఁ బెళ్ళన్
మును వేల్పుబాస వెంబడి
నునిచెదఁ గా దనకుఁ డయ్య యుల్లములందున్. 14

వ. అని పలికి లాలపరిగజాంకుశుండును రాయరక్షితసాళ్వాం
డును సతతాసింహాసనాధీశ్వరుండును సింగిణీసురత్రాణుం
డును దురగారోహణరేవంతుండును సింహతలాటరాయం
డును నగు మలికిభరాముపాదుశాహునకు నితవరియై చదు
వులకుం గుదురై మన్ననల కెన్నికయై చెన్నొందు నమీను
ఖానసింగంబు వంగడంబు నేర్పడించెద నది యె ట్లనిన. 15

సీ. మున్నీటిరాణి యౌ విన్నెత యేవేల్పు
నడుగుఁగెందామర నలరు తేనె
బాసవాల్గము లెన్ను ప్రామిన్కు లేవేల్పు
చెలువంపుఁబావాలగిలుకురవలు

కడిఁదిరక్కసిమూఁక మెడచాల్పు లేవేల్పు
చేనున్న సుడివాలు చికిలిక ళుకుఁ
గప్పుఁ దెమ్మెరపూఁపదిమ్ము దా నే వేల్పు
మంచుమించుల సాను పాచమాది

తే. యతఁడు దానైన కస్తూరుఁ డలమి కూర్మిఁ
బ్రోవ సత్యచింతామణి పోట్ల చెలువు
నందుఁ దెందేపలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ
బుడమి వెలసె హనుమామియాప్రభమితేఁడు. 16

క. కలిమిని బలిమిని విడిముడిఁ
బలుకులపస నీవితీవి బంటుఁదనమునన్
వెలయు హనుమామియ్యా అం
పిలు సొంపుల జాడుబీబిఁ బెండిలి యయ్యెన్. 17

క. అనుగువయందు నతఁడు బ
డేమియ్యాఁ గనియె సంనడించు చు సిరు లెం
తో మెఱయఁగ వెన్నుఁడు సిరి
చానువలన మరునిఁ గన్న చందము మీఱన్. 18

సీ. పూవింటివాఁడు నేర్పున సోయగంబున
వినువాఁక బిడ్డండు వింటికడిమిఁ
దామరచెలిచూలి తగునీగి నానచే
రాముండు ప్రతినబీరంబునందుఁ
బుడమితాల్పరియె నిల్కడఁ బల్కునేర్పున
రాజు సొంపున నిబ్బరంపుఁ దెలిపి
నేను మోముల మేటి హెచ్చగుబలిమిచే
రారాజు సొమ్ములరవణమునను

తే. నెట్టివజీర్లు నెన్నంగ నీడుగారు
కొమరుమీఱు హుమామియాఁకొమరుఁ డగుచుఁ
పొలుపుగనిన బడేమియాపుడమితేని
కహాహా! ముజ్జగములయందు నరసిచూడ. 19

తరల. పలుకులేజవరాలివేనలిఁ బాలసంద్రములోని యా
కలిమితొయ్యలిగేస్తునెమ్మెయి గాలి మేపరితేని చూ
పుల బెడంగును బాసవాల్కనుపూపకందుఁ దలంచు బా
గులయసంబు బడేమియా తనకున్ సతంబుగఁ దాలిచెన్.

వ. అతండు. 21

క. కలిమిచెలి వెన్నుఁడుం బలు
కులలేజవరాలు నాలుగుమొగములతఁడున్
బలెఁ దగు సిలారుబీబిం
గొల మలరఁగఁ బెండ్లియయ్యెఁ గూరిమిమీఱన్. 22

ఉ. చుట్టపువారి రాసిరులచూపులకోపులకై పులాని చే
పట్టి యనుంగుగా నపుడు ప్రాపగుకూరిమి నాబడేమియా
పట్టపురాణి యై కలిమిఁ బాటిలుచుండు సిలారుబీబి యె
ప్పట్టున నానెలంతకును బాటియెయెన్నఁగ గట్టుచూలియున్.

ఆ. ఆసిలారుబీబియందు బడేమియా
పుడమితేఁడు సిరులఁ బొందునట్టి
కడఁకతో నమీనుఖాను వేల్పులతేనిఁ
గనియె మదిని గూర్మి గడలుకొనఁగ. 24

క. అనువుగ మఱియునతఁడు సర
బనబీబిం బెండ్లియాడె బలువేడుకతోఁ

గనియొం దగ నాయమయం
దును బాబనుమియ్యా నీవితోవ చెలికానిన్. 25

మ. కలనం బాబనుమియ్యాసింగము కడంకన్ మార్తుడుచుంగు
జం, గిలిఁ జేకైదువ నొంచి వానితలలం గీల్కొన్న ముత్తెం
బు లే, తలఁబ్రాల్గా ననినేల పెంపొరఁగుగా దా సొంపుతో
మీఁలుచున్, గెలుపుం బైఁడినెలంతఁ గైకొనియె నగ్గింపన్
జగం బంతయున్. 26

సీ. పట్టంగనీఁడు సంబళికలు కలనిలోఁ
జేరవచ్చినమార్తుచేతఁ గాని
పూననీఁ డడపంబు పొగడుతో బవరంబు
సేయవచ్చినవాని చేతఁ గాని
తేనీఁడు గొడుగు మత్తిల్లి యాలంబులోఁ
జేపట్టమన్నీని చేతఁ గాని
తాల్పంగనీఁడు కుందనపుఘూరి చివ్వఁ
జెనకవచ్చినఱేని చేతఁ గాని

తే. యతనిఁ గొనియాడ నలవియే గ్రొందుతలల
వేల్పు రాయనికైనను వేయితలల
ప్రోడ కేనియు నని చాల బొగడ నెగడె
నిండువేడ్క నమీనుఖానుండు పుడమి. 27

ఉ. మించి యమీనుఖానుఁ డెలమిం గలబట్టుకు నెల్ల నిచ్చెఁ బ
ట్టంచులపచ్చడాలు వరహాలు సరాలు గుఱాలు కల్లకీల్
కుంచెలయందలాలు గొడుగుల్ పడగల్ కడుఁ దోరహ
త్తుగా, నెంచఁగ నెవ్వరీ డతని కీగిపసం బరికించి చూచినన్.

సీ. పలపలనై మ్రానుపడి పండ్లుచూపెడు
పుడుకుఁ జెట్లను వేఁడఁబోవ నేల
మించుచూపుచునె నమ్మించి నిల్కడయేది
విస మొసంగెడుమబ్బుఁ గోసర నేల
యొలివోయి యీలేక యొకపూఁటవెట్టెడు
తామరచెలిఁబట్టిఁ దడవ నేల
పొరలంగఁబడుచుఁ దాఁ దెరమలుంగున నుండి
కసరెడుమున్నీటఁబోసఁగ నేల
తే. తెలివి గురిగొల్పి నిచ్చలుపలుకుఁ దియ్యఁ
దనము గాన్పింప నొసఁగెడు దారిచేత
మిగులఁ బొలుపొందునట్టి యమీనుఖాన
గొడయఁ డొప్పులకుప్పయై యొనరుచుండ. 29

సీ. దురములో ప్రేఁటూపుతునుకలుగా ప్రేయు
నట్టి రౌతులకెల్ల నాటపట్టు
తొడరి బెబ్బులినైనఁ బెడకేలఁ బడఁద్రోయు
పూపు గట్టినబంట్ల పుట్టినిల్లు
వట్టిమ్రాఁకుల నిగుర్కొల్పెడు పాటలఁ
బాటిల్లు గాణల పట్టుఁగొమ్మ
పుట్టఁబుట్టినప్రోడ పొల్పునఁ జెప్పఁగాఁ
గలుగుజాణలమొత్తములకు నెలవు
తే. నైన తనపేరఁ గల్గు నమీనుపురము
నందు మున్నీటఁజోక చేయంగఁ జాలు
చెలువు త్రొక్కించె మిగుల నచ్చెరువుగాఁగ
నిందువేడ్క నమీనుఖానుండు మెఱసి. 30

ఉ. తామరతంపరై సిరులఁ దారొకొను కోసలనాఁట సత్యచిం
తామణి పొట్లచెన్నను సతంబగుచుండ సమీనుఖానుఁ డిం
పామతిలంగ నిల్పెఁ బొడవై వెడఁగైన మసీదుఁ గాంచి యం
దే మను వెండికొండపయి కేగఁదలంపక జేసికంటియున్. 31

చ. పొడవుల కెల్లనుం బొడవు ప్రోడలు నెమ్మదిలోనఁ గాంచు
ని,ల్కడ కడలేని తేజున జగంబున కవ్వలదైన వెల్గు నె,
య్యెడలను బొందువారలకు నెక్కుఁగ నిచ్చిన యామసీదు
నిం,పడర సమీనుఖానయొసఁగయందు తిరంబుగ నిల్పెఁ
బొల్పుగన్. 32

చ. కడక సమీనుఖానుఁడు జగంబు తనుం బొగడంగ వేడ్క
తో, విషువక యెప్పుడుం బుధమి వేల్పులబిడ్డల పెండ్లి చేయఁ
గా, నడరెడుబీడు లోఁబొడవు నందుకతంబునఁ గాదె
దూఁటుఁ జే,గడవులలోపలన్ సబిసిగ్రె కనుపట్టుడు గాలి
చూలియున్. 33

ఉ. దొమ్మి సమీనుఖానుఁ డని దూకొని గెల్పులఁగొన్న
సొమ్ముఁ దానిమ్ముల లిబ్బులున్నవని యేప్పడఁ జక్కలతేఁడు
గాంచి నా,తొమ్మికిలిబ్బులన్ బలిమితోఁ గొనునో యను
చుం దలంపులో, నమ్మక కాచియుండు జలసంబున రేలుఁ
బగళ్లు నెంతయున్. 34

క. అబ్బురమై పొలుపొందెడు
కబ్బంబులు చాల సంతి కనిరొ సపంబుల్
నిబ్బరముగఁ బొడమెడు పే
రుబ్బున నల్లడల జాణ లోహో యనఁగన్. 35

సీ. మారేళ్లు నేరేళ్లు మామిళ్లు జిన్నులు
మాదీఫలంబులు దూదినిమ్మ
లీఁడెలు మేడులు జీడులు దాడింబ
లనఁటులు పనసలు చనుపకములు
పొగడలు పొన్నలు పోఁకమ్రాఁకులు కమ్మ
రేనులు నిమ్మలు రేగు లిప్ప
లంబాళములు కజ్జూరంబు లనాసలు
నారికడంబులు నారదబ్బ
తే. లగరు లేలకి విరవాది యాకుఁదీఁగె
మల్లియలు గోజ్జఁగులు దాక మొల్ల మొగిలి
మొదలుగా నివి యెప్పుడుఁ బూచి కాచి
యుండుతోఁట లమీనుఖానుండు నిలిపె. 36

ఆ. ఏచి సనిచి పూచి కాచి పండిన యమీ
న్పురము మేలితోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకు నైనఁ
బండ్లువచ్చు నలరుఁ బ్రాయ మొదవి. 37

క. చలిపందిరులును సత్తరు
వులు నూతులు బావులుం బువుందోఁటలుఁ జె
ర్వులు నల్లింజ్లును మొదలుగ
నిలిపి యమీర్ఖానుఁ డసము నించెం బుడమిన్. 38

క. ఇట్టి గొనంబులచే నె
ప్పట్టున నెన్నంగఁదగిన బలియుఁడు సొంపుల్
నెట్టుకొనఁ దనకుఁ దగియెడు
పట్లపురాణులను గూర్చి పైపైఁ బరగెన్. 39

క. గరిత బడేఁ బీబిౙ నె
క్కరబీబిౙ నెమ్మబీబిఁ గనుపట్టెడు రా
మరుఁ డగునమీానుఖానుఁడు
సిరు లొదవఁగఁ బెండ్లి యాడెఁ జెలు వలరంగౙ. 40

వ. వారియందు. 41

చ. కొడుకులకోట పాల్కడలికూఁతురితో నెనవచ్చు లేమ యె, ప్పుడుఁ గడుఁ బేదలాదరువు ప్రోచును జుట్టలఁ గన్న తల్లి యై,యడుగిడ దావలం బెనిమిటాడినమాటను మాట వాసి జెం,దెడు బడెబీబి సాటి గలదే మఱియొక్క పొలంతి యయ్యెడౙ. 42

సీ. అత్తవారిండ్లకు నరుగుకన్నియలకుఁ
గట్నంబె లిచ్చుచు గారవించుఁ
బ్రొద్దు ప్రొద్దునన యెప్పుడు లేచి వాడల
పసిబిడ్డలకు నెల్లఁ బాలుపోయు
నాఁకొన్న వారల కద్దము రేయైన
నారగించఁగఁ బెట్టు నరసి యరసి
పాలునీ రెనసిన బాగునఁ బెనిమిటి
తలఁపులో మెలఁకువ మెలఁగ నేర్చు

తే. నౌర తనపుట్టినింటికి నత్తవారి
యింటికిని వన్నెఁ దెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడేబీబిఁ దరమె పొగడఁ
దమ్మిపూవింట నెలకొన్న దంటకైన 43

క. కలిమిపొలఁతిఁ బోలిన యా
చెలువకును నమీానుఖానుసింగంబునకుం

గలిగిరి గతాతఖానుఁడు
బలియుఁడు ఘాజీలఖాను పట్టపుదొరయుఁన్. 44

క. అనిలో గతాతఖానుఁడు
తనతేజీ నెక్కినట్టితటి నదరుం గ్ర
క్కున నెడమకన్ను నెకవెలుఁ
గునకుం దెఱగంటిదంటకొమ్మలగనికిన్. 45

సీ. నెఱపల్కు నెఱపులునే చాల మెప్పించి
యక్బరుచే మెప్పు లందుకొనియెఁ
జని విశ్వనాథదేవుని చేత మస్తున
వెలయునేస్నులఁ దెచ్చె వేనవేలు
పూనికి నేదులాఖానుపీటకి నేగి
పలుమఱు మించుకప్పములు గొనియె
మాదనమల్కుబరీదు నిజాంశాహుఁ
దనయేలికనుఁ బన్నుఁ బనుప నడఁచె
తే. మఱియుఁ గన్నడరాజులు మెఱసి పొగడి
నెనరు దళుకొత్తఁ గ్రొత్తకానుకలు వనుప
మనియె మల్కిభరాముమన్ననఁ గతాత
ఖానరాయఁడు రెండవ కలువతేఁడు. 46

సీ. తలిదండ్రు లేమాట తన కానతిచ్చినఁ
దలమోచి నడుచుఁ గతాతఖానుఁ
డిభరాముపాదుసా యేలెడుపుడమిలోఁ
దగవులరాజు గతాతఖానుఁ
డల చిన్నిపాయంబునందు రాజులచేతఁ
దగునిమ్మపండు గతాతఖానుఁ

డేప్రొద్దుఁ గూరిమి హెచ్చఁ గన్నయనిఁ
దలఁపులో నిలుపు గణాతఖానుఁ

తే. దరభి పారసీ గుజరాతి యారె మచ్చ
తెనుఁగు కన్నడి మొదలుగాఁ దెలిసి వ్రాయ
దారి గన్నట్టివాఁడు గణాతఖానుఁ
డహహా యతనికి నెవ్వరి దరసి చూడ 47

ఉ. లాలపరీగజాంకుశుఁడు లావున నాఁగరిజోదునైనఁ గెం
గేలనె గీ టడంచి బలుగెల్పుఁబయిండి నెలంత నేలుకోఁ
జాలినవాఁడు సొంపులను జందురుఁ డెంచ గణాతఖానునిం
బోలినవారు గల్గుదురె పుట్టినవారలఁ బుట్టువారలన్. 48

వ. అతని తమ్ముఁడు 49

మ. అనిలో మార్కొను మార్తురం దెగ్గఁగడు నెయ్యంబొప్పఁగా
వేల్పుకొ, న్ననబోఁడ్గం గలయంగఁ జేసి మరి కాసల్ గట్టు
లున్ వాఁడెలే, చుమకుల్ గానొనరించెఁ గొందఱికి నోహో
మేలు ఫాజిలుఖాఁ, మనకున్ సాటి దలంప నెవ్వరిఁక
నెందున్ గ్రందుగా నెన్నినన్. 50

చ. కని తనరాజు లెన్నుకొనఁగాఁ బెనుపాఁజులతో సిరంగరా
యని కడకేగిమాటలనె యాయనఁ దేఱిచి తెచ్చిమల్కకున్
మనుకువనంటుచేసి యొరిమం గడు వెచ్చులు గొన్న మేటి నే
మని పొగడంగవచ్చు నవు నౌ నిఁక ఫాజిలుఖానరాయనిన్.

సీ. తగు వేల్పు దొరరాణి మగమానికపుసొమ్ము
సెగ తేనిచాన గొజ్జఁగులబంతి
జము గేస్తు రాలిమై నసురుకప్రపుఁబూఁత
పొలదిండిరాతేని నెలఁతనగవు

నీటిరాయనికల్క నిద్దంపుదువ్వల్వ
తెమ్మెరకొమ్మచే తెల్లదమ్మి
ముక్కంటిచెలి లేమ ముత్తెంపుఁజేర్పుక్క
నెలతాల్పుపడఁతి పన్నీటిజలక
తే మగుచుఁ జెలువలగమి కాని దొగలతేనిఁ
గ్రిందుమీఁద నడంచి యేకందు లేక
యలమి షాజీలుఖానునియసము లెపుడు
నెలమి జగములఁ బండువెన్నెలలు గాయు. 52

సీ. మదిలోఁగి యలనిజామనమల్క పెట్టిన
పల్లకీ లోకవంక బాగుమీఱ
నుదిరి యేదులఖానుఁ డొసఁగిన పైగోవ
గుల్లాముల్ బడివాఁగె గొల్చి రాఁగ
వేడుకతో నేడుమాడెలవోరలు కా
నుక లంపినట్టి యేనుఁగులు బెరయ
కన్నడరాయఁడు మన్నించి యంపిన
ముత్తెలపెట్టెలు హత్తి మెఱయ
తే. నచ్చి తెచ్చిన సొమ్ములు మచ్చికలర
నిచ్చి యిభరాముశాహుచే మెచ్చుగనియె
నట్టిషాజీలుఖానరాయనికి సాటి
గలరె నేర్పరు లెల్లజగంబులందు. 53

వ. మఱియు నమీనుఖానుని రెండవదేవేరి యెట్టిదనిన. 54

తే. కలికి నిజమరి జాణ బంగారుకుండ
వన్నెవాసిగ మెలఁగెడిపిన్నపెద్ద

చుట్టములపాలితం గెట్టిజూ న్ననంగఁ
బేర్మిఁ జెలువొందు సెక్కరబీబి యెపుడు. 55

క. ఒఱపరి సెక్కరబీబీ
తెఱవందు సమీానుఖాను దేవర గనియెఁ
నెఱజాణ యబ్దులల్లిని
మఱియును షేకీభ రామమరునిం బేరిమఁ. 56

సీ. తనరూపువలయందుఁ దలిరాకుబోఁడుల
కనుఁదళుక్కు బేడిసగములు దగులఁ
దనచాగ మనుమబ్బు మొన వేఁడువా రను
చినుకు మేపుడుపుల్గు లెనసిపొదలఁ
దనయడుగుందమ్ములను రాచనెట్టెంపుఁ
బలుదిండి రాతుమ్మెదలు మెలంగఁ
దనపరంజీచిల్వకును మార్గులాతెంప్ల
యుసులు గాడుపు లింపు లొసఁగుచుండ

తే. నొనరునిభరాముపాదుశాహాజురునందు
బొందుగా వ్రాయనేర్చిన ప్రోఢ యైన
యబ్దులల్లీకి నీడెవ్వ రరసిచూడ
నహాహా గొనముల నతనికి నతఁడె తగును. 57

క. అరబీ పారసి కన్నడ
ము రుమీా కన్నోజి తెనుఁగు మొదలగు బాసల్
పరికించి కుతుబుశాతలఁ
పరయుచుఁ బొలుపొందు నబ్దులల్లీ పుడమిఁ. 58

ఉ కంటిని వింటి నేర్పునను గావక కయ్యమునందు నొంచినఁ
వింటికి నేఁగి వేలుపులపీటను జూపుకటారిక త్తెలా

దంటలగుబ్బచన్నులతుద న్నెలకొందుచు మార్తు రారయ
వ్వింటికి నబ్బులల్లి బలువింటికిఁ గీలవి యేమి గల్గెనో. 59

క. అతనికిఁ గూరిమితమ్ముఁడు
సతతముగ షేకీభరాముచదురుఁడు పగరం
దతిఁ గూడుకోక లరయని
ప్రతినలు వర్తించి మలలఁజ్జల కనిచెన్. 60

మ. అరయన్ షేకిభరాము రానెలకుఁ బ్రాపైనట్టి లోఁగూర్మిచే
సిరియుం బల్కుల త్మికంటెయుఁ గడుం జేదోడు వాదో
డునై, వరుసన్ త్రిస్మరు ముందు కన్న మత్రికై వారంబుఁ
గావింపఁగాఁ, ధర్మమే యాయునచాగముం జదువులుం దా
నొక్కముక్కంటికిన్. 61

వ. ఇంక నమీానుఖానుమూఁడవదేవేరి యెట్టి దనిన. 62

క. వీడదు తనచుట్టంబులఁ
జూడదు పెఱవారి మగనివో ప్పరయక మా
టాడదు పలువేల్పులఁగొని
యాడ దహాహా సెమ్మెబీబి నలవియె పొగడన్. 63

క. తగునట్టిసెమ్మెబీబీ
మగువయును నమీానుఖానమగసింగము సొం
పుగఁ గాంచి రబ్బులకరీ
ము గొనంబులప్రోకఁ జాగములతోఁ గత్రేనిన్. 64

సీ. మాటనేర్పున రాజు మదిఁ గూర్మి నింపఁగా
నలరించు నెప్పు డబ్బులకరీము
వలతేనికై వడిఁ దలిరాకుఁబోఁడుల
వలపించుజాణఁ డబ్బులకరీము

పారసీ యరబు లేర్పడ వ్రాయఁ జదువంగ
నలువ తలంప సబ్దులకరీము
అడుగువారలకు లే దనుమాట తనమదిఁ
దలఁపఁ డెన్నఁడును సబ్దులకరీము
తే. మించి యిభరాముశాహు మెప్పించి మేలు
తగటుదట్టీ ల్కుళాయీలు పొగరుమిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుఁ గాంచి
కలిమి పొగడొందెఁ బుడమి సబ్దులకరీము. 65

చ. చదువులప్రోడ నేరుపరి జాణలు మెచ్చఁ గడంగి దాయలన్
గదిమి యడంచి గెల్పుసిరిఁ గైకొని మించినమేటి యొప్పు
దున్, మదిఁ దనవేలుపు న్నిలిపి మల్కిభరాముశహాను
గొల్చుఁ గా, ర్మి దయిలువాఱ సబ్దులకరీమునకున్ సరి
యెవ్వ రిచ్చటన్. 66

వ. మఱియు మెఱుఁగుసిరులకు నెలవై తమ ఫేరుండైన హాజ
రతిమోఖ దుంజిఖాదిరి యడుగుందమ్ములు తలంపులో నెల
కొల్పి గతాతఖానుండును ఫాజీలుఖానయొడయండును
సబ్దులల్లీరాయండును సబ్దులకరీమును వీరలకుఁ గూరిమి
తమ్ముం డైనతసీరునిహాజరతి శేఖుబుదురుదిఖాదిరిని మనిం
దలంచు శేఖభరాముండును దనర్చిరి. 67

ఉ. ఇట్టి కొమాళ్లు రాసిరుల హెచ్చఁగ మించినప్రోడ యేలికై
పట్టపుతేండ్ల మ్రొక్కుఁ గని పాటిలు నాయిభరాము
శాహు చే, పట్టి యనుంగుగా నడుపఁ బాయక మూఁడు
తరాలనుండి కన్పట్టు నమీనుఖానుఁడు రసంబున మించె
నసంబు కల్మి చేన్. 68

షష్ఠ్యంతములు.

క. ఈగోనములఁ గడు మీఱుచుఁ
జాగపుమెఱవడిని వేల్పుజన్నియను నెలన్
వేగన్నులదొరమ్రాఁకుల
చేగం గైకొననియోగి చెలువపుశిబికిన్. 69

క. నిగనిగ మను*నెలకలుబలు
దెగలను వెలిపులుఁగుఁబదువుఁ దెలిమొగిలుగమిన్
దొగలన్ వగలం దగులన్
మిగులన్వడి నవ్వునసపుమిసుములగమికిన్. 70

క. తనవారి మనుప మూర్తురఁ
బనిపంపఁ గోలంబు నిలుప బలిమిని బుడమిం
దనరఁగ మానిసితన మూ
నిన కఱివేల్పునను రాచనెలతాల్పునకున్. 71

క. గమకమున నెదురుపగతురఁ
గొమరుంబాయముల వేల్పుకొమ్మలఁ గడుఁజొ
ట్టములఁగఁ గూర్చెడు నేరుపు
సమకూరిన రాయపతుసాళ్వంబునకున్. 72

క. పలుతలఁపులఁ బొలుపగు తన
తలవాకిట నెపుడుఁ బలుకుతలిరుంబోఁడిం
బొలుపుగఁ గాఁపురముంచిన
మెలఁకువ గలనేరుపరి కమీర్ఖానునకున్. 73

వ. సిరులుం గడు నమరు కొమరులుం గలిగి మనునట్లుగా నా

* నెలకలు=చంద్రకాంతశిల.

యొనర్పం బూనిన యబ్బురం బగునిబ్బలుకబ్బంబునకుం
బ్రావ యగుత్రోవ యొట్టి దనిన. 74

సీ. తగఁ గోటఁ దాచిన మగమానికంబుల
 తెలిరంగు లెపుడు వెన్నెలలు గాయ
మేడలపై నాడు మెలఁతలుఁ దెఱగంటి
 కొమ్మలు నెప్పుడుఁ గూడితిరుగఁ
జిలువచామ లగడ్తవలినీటిపైఁ దేలి
 యొరిమతో ననయంబు నోలలాడ
మేలిమిబంగారు మేలిపచ్చలడాలు
 మిసిమి మింటికి నెల్లఁ బసిమి యొసఁగఁ

తే. జదల రాసినకొమ్మల చాలు కతన
మీఁద రారాక యలప్రొద్దు మెఱుఁగుఁదేఱు
గవనులనె రాకపోకలు గా మెలంగఁ
దనరుఁ బుడమిఁ బ్రతిష్ఠాన మనఁగ వీడు. 75

క. పొడవగుబంగరుమేడలఁ
గడువేడుక నాడుపడఁతుకలమొగములతోఁ
దడఁబడుదు నంచు రేలం
గడకడఁ జనుఁ జందురుండు కందుచు నచటన్. 76

చ. కనఁదగు తెల్లమానికపుఁగప్పుల నొప్పెడు చప్పరాలలోఁ
దనపొడ వైన నీడఁ గని తాళక యేనుఁ గటంచుఁ గొమ్ము
లం, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపుసింగపుం
గమిం, గనుఁగొని పాఱు వేల్పు దొరగారతఁ డొందల
మస్తరింపఁగన్. 77

మ. తళుకుల్ గుల్కెడు నందు మేడలతుదం దార్కొన్న బం
గారుకుండలు మిన్నేటను గానిపించుచును విన్నాణంపుఁ
దెల్వొంగడుఁ, విలసిల్లం గని పైఁడితమ్ము లనుచున్
వేల్పుంబువుంబోండ్లు చేతులఁ దేరంజనఁ జూచి నవ్వదురు
రంతు ల్లాఁగ జేజేదొరల్. 78

చ. దళముగ నందుఁ గోటలతుదం దవిలించిన మించుపైఁడివ్రాఁ
తలకటితొ క్కెముల్ గని యెద న్మెఱుఁగు ల్గల మబ్బులంచు
అంపిలి తగ నాడ నన్నెమలిపిండుఁ గనుంగొని చిన్కుఁ
గూటియ, ప్పులుఁగులు సంతసిల్లుఁ గడుప ల్గడునిండఁగ
నానుఁగోర్కులన్. 79

క. అగడితలోఁ గెంబామార
మొగడలు గనుపట్టుఁ జాల మూఁకై చూడం
దగి మున్నీటం దేలుచు
బెగడని వార్వంపుటగ్గిపిల్లలు వోలెన్ 80

సీ. మెఱసి పోవక నిల్చి మెలఁతలై యొఱపుచేఁ
దిలకించు క్రొమ్మించు తీవె లనఁగఁ
గప్పారుతొంగలిఱెప్ప లల్లార్చక
న్గవల నొప్పెడు వేల్పుటువిద లనఁగఁ
గడుసోయగంబుచేఁ బుడమిపై
నడయాటఁ బొలుచు మేలిమిపైఁడిబొమ్మ లనఁగ
సింగార మమరంగఁ జికిలిచేయించిన
వలరాచవానిపూములుకు లనఁగ

తే నలువ కాఁ జేయఁగలిగినపొలుపుఁ గూర్చి
కరముఁ జేతులఁ బట్టినఁ గందు నంచుఁ

దలఁచెఁ గొమ్మలుగా నన నలరునట్టి
పువ్వుఁబోండ్లు దనర్తు రాప్రోలిలోన. 81

ఉ. ఇంచుక కేల వాగె గుదియించిన సంభ్రమువాఁటుచుం
జూమా,యించిన నేల గ్రక్కదల నిట్టటుగా వడిఁ ద్రొక్కు
చుఁ దువా,ళించిన గట్టు గు ట్టనక లెక్కకు మిక్కిలి
దవ్వవాఱుచుఁ, మించినవారువంబు లట మీఱుచుఁ
ద్రిమ్మరు నెన్ని యేనియుఁ. 82

చ. ఎనిమిది తావులం దొడరి యేపుగ నెప్పుడు నాము జాఱఁగా
నెనయుచుఁ గెంపు రేకలు పయిం బొలుపొందఁగ నందు
నేనుఁగుల్, తనరుచునుండు నాకసముదాఁకెడు నిక్కనఁ
జూప ఱబ్బురం, బన నెలయేళ్లతోడ నడయాడెడు జేఁగు
ఱుఁగొండలో యనఁ. 83

సీ. బెళుకులై తళుకులు గులుకు కన్నుల చెన్ను
కలువల కొకవింత చెలువు గొలుప
గొప్పలై యొప్పులకుప్ప లై పాలిండ్లు
విరిబంతులకు వింతసరవిఁ గఱపఁ
బొలుపులై వలరాచబులుపులై పలుమొనల్
మొల్లల కొకవింతమురువు నింపఁ
దళుకులై తేనెలు చిలుకు మోవులరంగు
చెందొవలకు వింతసిరులఁ జేయ

తే. సొలపు వలపును గొలుపు నిచ్చలపుఁ దెలుపు
నగవు మల్లెల కొక వింత నయముఁ దెలుపఁ
గోడెకాండ్రకు విరు లమ్ముకొందు రెపుడుఁ
బువ్వ లమ్మెడు చెల్వ లాప్రోలిలోన. 84

సీ. నగఁగల్గినను జాలు మొగసాలవాకిలి
కావించు నట్టేసికంటె నైనఁ
జని చూడఁగల్గినఁ జాలుఁ జేయును నన్ను
కానిగాఁ బూవిలుకాని నైనఁ
బలుకఁ గల్గినఁజాలుఁ బనులు సేయించును
వెట్టిమైఁ జదలేటిపట్టి నైనఁ
జెనకఁగల్గినఁ జాలుఁ జేయును దనయింటి
చుట్టుఁ ద్రిప్పుర గాలిచూలి నైన
తే. నంటఁ గలిగిన నవ్వెనకయ్య నైన
గోఁచి విడిపించి వలపులు గొల్పి నిచ్చ
వెంటఁ దిరుగాడఁజేయు నవ్వీటిలోనఁ
గలుగు వెలయాండ్రగమి పొల్పువలకుఁ దిగిచి. 85

క. పలుకుల చిలువలదొర లన
నలుమొగములు పూని ంగనినలువ లనంగాఁ
దొలుమినుకుల ప్రోవు లన
న్వెలయుదు రవ్వీటి పుడమివేలుపు లెపుడున్.	86

సీ. వరుసవెంబడిఁ గాని పొరిఁగొనలేఁ డయ్యె
మార్తుర నారాముమనికి యెంత
దురములో సిరిగేస్తు నెరసొచ్చి పగవారి
గెలిచిన కవ్వడియల వ దెంత
మూఁడుపాలెములు తెంపున గెల్చి పొదలు జా
బిల్లితాలుపు వేల్పు బీర మెంత
కోమటిసైదోడుఁ గూడి త్రిమ్మరి పేర్మిఁ
దగువిక్రమార్కుని తెగువ యెంత

తే. నేలపై నిల్చి తమయేపు నిలుపలేక
బెడిదమునఁ బర్వు పిడుగులకడిమి యెంత
యనుచుఁ గేలిగ రచ్చల నాడుకొనుచు
నేచి పచరింతు రచ్చటి రాచవారు. 87

క. తడవఁగ వసనూ యందుల
నెడపనిసిరు లేరికైన నెఱుఁగఁగవచ్చున్
నోడువక కోటికి నెత్తిన
పడగలచేఁ గోమటిండ్లు బంగరుమళిగల్. 88

క. గడితపుఁబిడుగుల నైనను
బెడిదపుసింగముల నైనఁ బెడచేఁ బుడమిం
బడనడుచుబంటు లెన్నఁగఁ
గడలేక తనర్తు రచటఁ గడుబీరమునన్. 89

వ. ఇట్లు కడలికడగాఁ గలుగు పుడమిపడఁతికిఁ దొడ వనం
గడునొప్పు నవ్వీడేలు నేలతేఁ డెట్టివాఁ డనిన. 90

సీ. విన్నేరు తలఁగల్గు వేల్పునౌఁదలపువ్వు
తలఁప నెవ్వనితాతతాతతండ్రి
కలువలచెలికాని గారాపుఁబట్టియై
తనరారు నేఱేనితాతతాత
దీవులు పదునెన్మిదింటితో నేలయం
తయు నేలె నేఱేనితాతతండ్రి
తనయాన సుడిగట్టువెనుకఁ బర్వఁగఁ జాలఁ
దేజునమించె నేరాజుతాత

తే. చేరి జేజేలు మఱి జడదారిగములు
నచ్చరలు గొల్వ వేఁగన్నులతనిమొదలి

రాచనెల వేలెఁ బేర్మి నేరాజుతండ్రి
యతఁడు గొనియాడ నెగడె యయాతి పుడమి. 91

సీ. తనవాలుముక్కంటికిని మార్తురగు రాచ
గములెల్లఁ బూవిలుకాండ్రు గాఁగఁ
దనరూపువలకుఁ బైదలులనెమ్మదులెల్ల
మేలైనబేడిసమీలు గాఁగఁ
దనయీగితోఁగతేనికిని వేఁడువా రెల్లఁ
దులకించుకల్వలతుటుము గాఁగఁ
దనగెల్పుకట్లప్రాఁతలకు మున్నీటియ
వ్వల నున్నసుడిగట్టు పలక గాఁగఁ

తే. దనదుతేజు జగంబనఁ దగినతమ్మి
కొలకునకుఁ గోర్కులిడు వేఁడివెలుఁగుగాఁగఁ
గడలిలోఁగొనఁగల్గిన పుడమియెల్ల
నానకును లోనుగా నేలె నయ్యయాతి. 92

చ. అనికి నెదుర్పఁజాలుఁదొర నారసి కానక యయ్యయాతి
దాఁ, బెనఁకువ మేటిజన్నములు పెక్కులు చేసి పసిండిఁ బా
ఱులం, దనుపఁగ దాని నిచ్చు నని దయ్యపుమూఁకలు పైడి
కొండపై, ననయము గాఁపురంబులుగ నన్నియుఁ గాచుచు
నుండు నెంతయున్. 93

చ. తోఁటలు లేనిత్రోవలును దోరపుజన్నపుఁగంబము ల్గదు
న్నాటనియేటిపెందరులు నాడెపుఁబాఱుల కీనియూళ్లు నీ
రాఁటనిగాటపుంజెఱువు లారయ నబ్బుర మెంచి చూడ న
మ్మేటియయాతి యేలుపుడమిం దగునబ్బలియుం దలంపఁగన్.

సీ. తలఁపఁడు జేజేలుఁ బొలసుఁదిండ్లును గొండఁ
గలఁచిననాఁటియంకిలి యొకింత
యెఱుఁగఁడు తనలోన నేప్రొద్దుఁ బాయక
యేర్పువార్వపుటగ్గియొగ్గు మదిని
మఱచెఁ జాల్వేరింటిమగువ నేలినవేల్పు
చిలుకువేఁడిమి నింకి కలఁగఁబడుట
యెఱుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్క-
గొనినయప్పుడు గలకుతిలపాటు
తే. నయ్యయాతి గడంగి నెయ్యమునఁ బుడమి
వేల్పులకుఁ బైఁడి మొసఁగెడువిడుపునీట
నిండి కొద వేమియును లేక యుండెఁ గడలి
యతనిచాగంబు లిఁక నెన్న నలవి యగునె. 95

క. ఆరాచవేల్పురాయఁడు
వేరపుఁజే రెండు నైన వినఁబడకుండం
దోరముగఁ జిల్వ జేనికి
నూరటగాఁ బుడమిఁ దాల్చి యొకనాఁ డంతన్. 96

సీ. పదియాఱువన్నెలపసిఁడిగోడల *చెంతఁ
దిర మైన కస్తురితీనియలును
బాఁపమేఁపరిపచ్చపలకలఁ జెంగల్వ
దొరతాలఁ దీర్చిన దూలములును
మగమానికంబుల తెగల బోదెలచేత
పగడంబుగొప్పకంబములగములుఁ
బెద్దతామరకెంపుబిగిపట్టియలచేత
సొబగైన ముత్తాలసోరనమ్ములు

*గోడలచేత-పాఠాంతరము.

తే. వాసి యేనుంగుకొమ్ములఁ జేసినట్టి
బోరుతలుపులచేతఁ గప్పూరపుఁబనుల
యొరఁగులును మించుకొల్వునుప్పరిగెలోనఁ
బరఁగు గొజ్జంగిచల్వచప్పరమునందు. 97

సీ. అలవేల్పుదొర పంపినట్టి తలంపుటా
పనియడపం బొక్కపడఁతి దాల్పఁ
జెలిమితోఁ దామరచెలిపట్టి యనిచిన
బలునరంజీ యొక్కచెలువ పూనఁ
గడఁగి గాడుపుఱేఁడు కానుకంపిన తెల్ల
వీచోపు లిద్దఱువెలఁదు లిడఁగఁ
బైఁడిరాయఁడు కూర్మిఁ బనిచిన నెత్తమ్మి
కెంపుగిండి యొకర్తు కేల నలమ
తే. వెండియును నేలచెఱఁగుల నుండురాజు
లరికి నిచ్చినకన్నియ లడఁకువలను
గదిసి కట్టడ యగునూడిగములు సేయఁ
బచ్చసింగంపుగద్దియపైఁ జెలంగె. 98

క. మానికపుసొమ్మురంగులు
పూనిక నరుదైన మేనిపొలుపునకుఁ గడుఁ
మాననియారతు లై తగఁ
దా నొకమరుఁ డనఁగ నెఱపుఁదనమున నొఱపై. 99

సీ. ఆహాపరాకు విదేహునికాను కీ
సొబగైనయట్టి కస్తురిమెకంబు
లెచ్చరికయ్య మాహిష్మతియేలువాఁ
డనిచినాఁ డీచిన్నియలరుఁబోండ్ల

నవఘారు కుంతలుం డంపిన వీయాము
పొగరుచే మీఱు నేనుఁగులగములు
చిత్తగింపుము సామి సింధురా జంపెను
వడిమీఱునీమేటివారువములు
తే. ననుచుఁ బేరొడ్డని కటకవాం డ్రగ్గలంపు
రవళిగాఁ జూపి తెలుపఁగాఁ దవిలి వాని
నల్లనల్లనఁ గనుఁగొంచు నుల్లసిల్లి
యపుడు పేరోలగం బుండె నయ్యయాతి. 100

వ. అంత. 101

సీ. గురివెందపట్టెళ్లకును దోడు సందిళ్ల
బీలిదండలు గూర్చి చాలఁ దొడిఁగి
యెడనెడఁ బికిలిపూ లిడినసంకులపేర్లు
కోరెందపూసలఁ గూడఁ డాల్చి
గుఱుతుగా మెఱయు జేగురుబొట్లమీఁదఁ దం
గేటిపూఁబోరలు రాగిల్లఁ దాల్చి
బరువైన పాఱులాకులబొట్టదట్టీల
దిండుగాఁ దీఁగెలపండు చుట్టి
తే. కుఱుచచేతులు మిడిగ్రుడ్లు కఱకుమీస
లిరులు గ్రమ్మెడు మేనులు నిరుకుచోర
లేఁచమాటలు జడగొన్నపీఁచుఁగురులుఁ
గలుగ నెఱుకులు దగఁ బొడఁగనఁగ వచ్చి 102

ఆ. పికిలిపూలు బూతపెల్లు లేనికకొమ్ము
లలరుఁదేనె పెద్దవెలగపండ్లు

వెదురుఁబ్రాలు ఱాతివదనికల్ గసగసాల్
జల్లి మెకపుఁజాలుఁ జాఱపప్పు. 103

మ. పులికూనల్ సివరాలుఁ గస్తురిమెకంబు ల్లేళ్లుఁ గుందేళ్లుఁ
బందులుఁ గార్పోతు లెలుంగు లేడులును మన్నుంబిళ్లుఁ
జివ్వంగిపిల్లలమొత్తంబు జవాదిపిల్లులు మొదల్గాఁ గానలో
వానిగుంపులఁ గైకానుకచేసి యాఁదలల మోడ్పుంజేతు
లం గూర్చుచున్. 104

వ. చాగి మ్రొక్కి లేచి యిట్లనిరి. 105

సీ. కొండమల్లయ్యచే నుండు నందురు గాని
జింకను గాన మేవంక నైన
నొకటియాజమునకు నున్న దందురు గాని
కాఱెనుపోతును గాన మెచట
నలకంబమయ్య తానైన దేమో కాని
సింగ మొక్కటి యైన సెలల లేదు
గాలిదేవరకును గల దటందురు గాని
యిట్టి నొక్కటిఁ జూచి యెఱుఁగ మెందు

తే. పాళి నేఁటేఁట మీరు వేఁటాడుకతన
నిప్పు డేఁడాదిగోల్ సామి యేగుదేమి
నేలయీనిన తెఱఁగున నోలి నెపుడుఁ
గడమి నెడయాక తిరుగు మెకంబు లడవి. 106

తే. చేలుఁ బోళ్లును బీళ్లును జేరి చొచ్చి
పైరుపచ్చలు మేసి యప్పాటఁ బోక
పల్లియలు సొచ్చి తోఁటలు పాడుచేసి
కావరంబునఁ గదుపులై గాసి చేయు. 107

క. ఏటికిఁ జెప్పఁగ సామీ
మీటినఁ జము రోలుకున్నట్టి మెఁగములు మిఁగులన్
గాటమ్ము లైనయమ్ములు
నాటక తిరుగాడుఁ బొలము లన్నియుఁ దామై. 108

వ. అని విన్నవించు చెంచులవిన్నపం బాలించి సంతసంబున
వారికి నుడుగర లిచ్చి నేఁడు వేఁట యని వీటం జాటఁ
బడవాళ్లం బంచి పేరోలగంబు విచ్చి కొలువువారల ననిచి
ననుచుసంతసంబునఁ దననగరికింజని తగుపనులు దీర్చి
వేఁటకు నంగగు సింగారంబునం బొంగి పేరులు మొద
లుగాఁ గలుగు నిద్దంబులగు వాయిదంబుల పెన్నవలి దవిలి-
నేలచెఱంగులమేసుంగులచెవులకుం జెవుడు గొలుపఁ
బౌఁజులునడువం బుడమిం బొడము దుమ్మునం గ్రమ్ము చిమ్మ
చీఁకట్లునడిదంబులబెడిదంపుఁజాయలు విరియింప నొక్కవారు
వంబు నెక్కి వెడలె నప్పుడు వేఁటకాండ్రు నాయితం బై.

తే. వేటవలలును మేటికుందేటివలలు
నెలుకవలలును సవదండవలలు దొడ్డి
వలలుఁ బందిటివలలును బలువు మఁకిల
వలలు మొదలుగఁ గలిగిన వలలు మఱియు. 110

క. ఉద్దవిడిఁ గవియుకుక్కలు
గద్దఱి సివ్వంగులిర్లుఁ గడునేచిన మే
లెద్దులు మొదలుగ వేఁటకు
దిద్దినయవి ప్రోఁగుఁ ద్రాళ్లఁ దెరచీరగముల్. 111

క. బలువైన వేసడంబులు
జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గి

ద్దులు మొదలుగఁ గలవిడివేఁ
టలపులుఁగులు పదనుతో మిటారింపంగన్. 112

ఆ. కాఱుకోడి కొఁజు కక్కెర పూరేడు
కేరజములు మఱియుఁ బేరుగలుగు
చిందమొదలుగాఁగఁ బొంది వేఁటకు **మీఱు**
పిట్టలెల్ల కూళ్ల బిట్టు చెలఁగ. 113

క. *మరితెరలుఁ జిక్కములు వం
కరబోనులుఁ ద్రాళ్లు నురులుఁ గాలురులును జే
గురుగండెలుఁ దలముళ్లున్
గరిచిలుకులు విండ్లులోనుగాఁ గొంచు వెసన్. 114

వ. వేఁటకాండ్రు కొలిచి నడువ సంతసంబునం గొంతద వ్వరిగి యంతట బలుమూఁకల మెకంబుల నిలుచునట్లుగా నేమించి వేఁటకుం దగినపోఁజులతోఁ జని ముందట. 115

సీ. నింగి బీటలువాఱఁ బొంగు సింగంబుల
రవలిచే దెస లెల్లఁ జెవుడుపడఁగఁ
బొలసుదొబ్బల నుబ్బుపులుల పెనొబ్బలఁ
గడలియుఁ బలుమాఱుఁ గలఁగి పొరల
వీఁక నేనికమూఁక విఱుచు మ్రాఁకుల మ్రోఁత
పెటపెటల్ మలల నిట్టటుగఁ జేయ
**మీఱుచు** నేట్లాడు కాఱుపోతుల కొమ్ము
చప్పుళ్లఁ బులుఁగులు కుప్పఁగూల

తే. గొరగొరం జను పందుల ఘుర్ఘురంబు
బెడిదములఁ బుడమియు వడవడ వడంక

---

* ఈ పద్య మొక్క ప్రతిలో లేదు.

నెపుడు నెడయాని చీఁకట్ల నివముగొనుచు
నొంటిఁ జొరరానియట్లుగా నుండె మఱియు. 116

తే. ప్రొద్దుచాయలు దూఱక ప్రాల్గుచేసి
యిసుము చల్లిన రాలక యిరులు గ్రమ్మి
నడువఁగా రానియొక్క కారడవి నపుడు
కాంచి వెఱఁగందె నారాచకలువతేఁడు. 117

వ. ఇట్లు కాంచి వెఱఁగందు డెందంబున నయ్యడవిం గొంతద
వ్వరిగి ముందట. 118

సీ. అలరుకస్తురిఁ దీనె లలికి వాకిళ్ల చెం
తలవ్రైచిపోయిన తట్టుపునుఁగు
గోడలు పూయంగ గ్రుమ్మి గందంబున
మేదించినట్టి జవ్వాదియడుసు
నాడాడ సరిబేసు లాడి పోవిడిచిన
ముదురువెదుళ్లలో ముత్తియములు
బలుపుకేనికకొమ్ముటలవలపైఁద్రోవఁ
దవిలించి కట్టిన సవరములును

తే. వంటకట్టెల కని తెచ్చి వాము లిడిన
యగరుమ్రాఁకులపై సిండ నాఱఁబెట్టు
కప్పురంపుటనంటులు గలిగి మెఱయు
నెఱకుపల్లియ లొకకొన్ని యెదుటఁగాంచి. 119

సీ. చెవుల కీతెల్లయుచ్చితకాయ లెంతేసి
పారుటాకులది కుప్పసమి దప్ప
అయ్యకుఁ గట్ట నెంతరఁటాకు గట్టెరా
యీపచ్చతాడిబి ళ్లేడదొక్క

వ్రేళ్ల జుట్టిన వెట్టివెల్లోకో చేతులఁ
బండుఁదీఁగెలవి గోప్పలు కడేలు
తలకు వేనీకలో తాల్చిరి యీలాగు
నీయుచ్చుగురిజపే రెండుఁ గలిగ

తే. రాజు కాఁ డన్న కంబము రాయఁ డితని
వేసమును మేలు బాగెము సేసియుంట
నిపుడు గనుఁగొంటి మనిపల్కు నెఱుకుదొరల
ముగుదమాటలు విని చాల నగుచు నలరి. 120

వ. చనుచున్నెడ నిచ్చోటు వేఁటకు వాటం బని వేటకాండ్రు విన్నవించుమాట లాలించి వేఁట వెట్టు మని పుడమిఱేఁ డానతిచ్చిన. 121

చ. దురమున వారువంపుగమి ద్రొక్కఁగ లేచిన దుమ్ము గ్రమ్మి నన్, బురదయి యుండునాకడలిఁ బూనిక నేనిక మూఁక రేసి వేమఱు బుసకొట్టఁగా నెగయు మవ్వపుఁదుంపురు నీటిచేత రా, సిరిపయిఁ గూరిమిన్ మగుడఁ జెల్వుగనించిన యాభగీరథా. 122

క. తెలివిం బుడమిం దగుక
ల్వలరాయా మైఁదనర్చు వలరాయ కడుం
గలనైన వీఁ గెఱుంగక
కల నైన న్నెఱియు పెంపుగల ముక్కంటీ. 123

మత్తకోకిల. పోరులం దెగి నీదుమార్తురు ప్రొద్దు నెన్నడు మొక్కటం, జేరి బల్విడిఁ దూఱి బంగరుచేలయు న్సిరితోడి సిం,గారము న్పడివాలుఁ జిందముఁ గల్గి సొంపుల మీఱుచున్, రారు వేలుపుఁజాన లిండ్లకు రాసిరిందగు నేర్పరీ.

గద్యము. ఇది శ్రీమదనగోపాలమంత్రప్రసాదలబ్ధసారస్వత సుక
విజనవర్ణనీయవచోవిభవ భావనామాత్యతనూభవ పొన్ని
కంటివంశ్య తెలగనార్యప్రణీతంబైన యయాతిచరిత్రం
బనునచ్చతెనుఁగుకబ్బంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

క. సిరివంటి బడేబీబీ
విరిఁబోఁడికి వెన్నుఁ డనఁగ వెలయుచు మిగులన్
గరగరికలఁ దనరెడు రా
సిరులందు నమీనుఖాన చెలువములగమీ. 1

వ. ఆటమీఁది తెఱంగు వినుండు. 2

సీ. కంబమయ్యరో మేలు గలిగించు నీకొక్క
గరుటాలమంతుని గాను కిత్తుఁ
గాత్రేడ మెకములకదుపు రాఁజేయుమీ
జింక నొక్కటి నీకుఁ జేతి కిత్తు
మలలమ్మ వేటలో మాపాలఁ గల్గుమీ
సింగంపుఁగోదమఁ దెచ్చెదము నీకు
దుర్గమ్మ కాఱుపోతుల లోను జేయుమీ
తొలిముద్దగా నిత్తు దుంత నొకటి
తే. యనుచుఁ దమవేలుపుల నెల్ల మును దలంచి
వేఁడుకొని మ్రొక్కి వాకట్టువేళ్లు గొనుచు

వలను లెస్సైనన మిక్కిలి నలరుకొనుచు
వచ్చి యెలుకలు వేఁటాడఁ జొచ్చి రపుడు. 3

క. మునువడిన మెకముఁ గొని చని
కనుగ్రుడ్లు పెకల్చి నెత్తి గడిగి కటారిఁ
గొని తోఁక పొడిచి యొకఁ డా
ననఁగ సుఖాళించె నయ్యయాతికిఁ గడఁకన్. 4

వ. అంత నెలుకలు కలుకుంబలుకులు చెలంగఁ జేర్చి యార్చిన.

తే. తొలుతమ్రింగిన కొఱనెలల్ నెలవులందుఁ
గడఁగి వెడలించు నెలకిండిగాము లనఁగఁ
గొమ్ము పందులు వెడలె ఘుర్ఘురము లడరఁ
బొదలలోనుండి యప్పు డార్పులకుఁ గాఁక. 6

క. పొద లట్లు వెడలు పందుల
కదుపులఁ బట్టెడలు దిగిచి కవియించిన బె
ట్టిద మైనజాగిలంబులు
చెదరక డాయంగఁ జూచి చెంచులు కడఁకన్. 7

క. వడి నుసికొలుపుటయును నిరు
గడల న్వెనువంకఁ జేరి కలువఁగఁ గినుకం
గుడియెడమఁ దిరుగు నెడమం
గుడిదిరుగున్ సాగి పోక గుటగుట లడరన్. 8

ఉ. అంతట నొక్కచెంచు కడు నగ్గలికం జని పందిపోటుమై
చెంతకుఁ బోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తఁ
బంది నిం,తింతలు చెక్కలై పడఁ బయిం బడి నొంచెఁ
బిడేన దాని క్రొ, వ్వంతయుఁ గాఱె కాఱె యచటాతక
నేతను దోఁగునట్లుగన్. 9

ఉ. కుక్కల నొంపఁ జూచి మఱికొందఱు కొన్నిటిఁ
వాలునం, బ్రక్కలు చించివం గదిసి పైఁబడి కొమ్ముల వారి
సందఱుం, జెక్కలు చేసివం గడలఁ జెంచులు వేఁజముదాళ్లఁ
బందులన్, బ్రక్కలువాపి రన్నిటిని వండఁగఁ జెండిన
మాడ్కి నుండఁగన్. 10

చ. ఎదురుగఁ బీఁటవెట్టుకొని యెవ్వరు జేరఁగ నీక నల్లడం,గది
సిన కుక్కలం దునుమ గద్దఱిఁ౦ది నొకండు వెన్ను చే,యద
రక ముప్పిడిం బొడిచి యంటఁగఁ బట్టుచుఁ గోఱఁగొట్టిన,
నెదలఁగనీక తెచ్చినను మెచ్చులొసంగెను రాజు వానికిన్.

సీ. వేల్పుమన్నీనికై వెఱచి పెగ్బ్రవలలో
నొదుఁగుకాటుకకొండకొదమ లనఁగఁ
బ్రొద్దునకై లోఁగి పోయి సందుల దాఁగి
బెదరి వేఁడలు నిల్లపిల్ల లనఁగ
నచట బల్లఁ దమచాయ నంటినట్లుగ నుండఁ
దిరుగులాడెడు నీలితిన్నె లనఁగ
నడవిమున్నీరంచు నరుదెంచి పోలేక
పూని త్రిమ్మరు మబ్బుకూన లనఁగఁ

తే. దావిగుబ్బలిదెస యేలుదేవ రలిగి
పుడమిఁజూపిన తనబంట్లపూఁప లనఁగఁ
జూడ మేనులు గరుదాల్పు చొప్పు గలుగు
నెలుఁగులను జూచి మది నుబ్బి యెఱుకు లెదిరి. 12

క. వడి నొక్కయెలుఁగు చెంచులఁ
గడచి తనుం బొదువ వచ్చుగద్దఱియెఱుకున్

మెడ వట్టికొన్నఁ గ్రిందను
బడి ముప్పిడి నతఁడు పోరఁ బగిలిచి నొంచెన్. 13

క. దానిఁ గని వచ్చి పైఁబడు
వానిని బల్లెములఁ గొంగవాలుల సురెలన్
మేనులు వ్రాలిచి పెంపున
తేనికి సంతసము చేసి తేసిరి కడఁకన్. 14

వ. అప్పు డొకకొందఱు. 15

ఉ. చెంగటఁ బాఱులేళ్లఁ గని చేతుల సన్నల నెడ్ల నిల్పి సి,వ్వం
గులబండ్లు డించి తగ వానికిఁ గన్మఱుఁగు ద్దెరల్చి యా
ముంగలఁ బాఱఁ జూపుటయు మున్పుగ నాయుచుఁబోయి
చేరువం,జంగున దాఁటి పై కుఱికి చంపి కలంచెను వాని
నన్నిటిన్. 16

తే. పెంపుటిఱ్ఱులు కినుకలు పెనచి పోయి
కొమ్ములు చుప్పలఁ దగిలించుకొన్న నరిగి
రాజు చూడంగఁ జెప్పంగరాని కడిమి
నీఁటియలఁ గ్రుమ్మి నొంచిరి లేఁటిమగల. 17

క. ఎద్దులు మఱుఁగులుగాఁ జని
గద్దరులై చేరుపెన్నెకంబుల నాలో
నుద్దవిడి నొంచి రలవున
నద్దిరయని యయ్యయాతి యబ్బురపడఁగన్. 18

క. మిడి బోనులఁ గాలుచ్చులఁ
బడఁదోలియుఁ బోఁగులోను పఱచియు లేళ్లన్
వడిగల జింకల నెల్లం
బొడిచిరి కడుఁ జెంచు లాఱుపులఁ జద లదరన్. 19

వ. అప్పుడు. 20

ఆ. పాదివేఁటఁ జూడఁ బదరెడు రాత్రేని
మది యెఱింగి తడవు మనిన వెలిచె
కౌఁజు కారుకోడి కక్కెర పూరేడు
చింద లున్నగూళ్లు చేరఁదెచ్చి. 21

క. ఎడఁ గలుగఁ బెట్టి తలుపు
ల్విడ నవి గావించు రవలి విని చని గూళ్లం
బడుపులుఁగుల నుసులులతోఁ
గడు వేడుకఁ దెచ్చి యొకఁడు కానుక చేసె. 22

తే. అపుడు నిడివేఁట యిడుమని యాఁతిచ్చు
రాజుముంగలికడఁకుఁ జేరంగవచ్చి
లగుడు సాళ్వంబుడేగ లోనుగను గల్గు
వేఁటపుల్గుల విడిచిన వింటి కెగసి. 23

సీ. కొక్కెరపూరేడు గోఱువంక లావుక
పొన్నంగి కోవెల కన్నలేడి
బెళగువ్వ బాతులావిల మూపతప్పుడు
గాఁడు నెమిలి పాలకాకి చిలుక
బలితపువెలిచె పావళము తీతువు చింద
కక్కెర యేట్రింత కారుకోడి
కౌఁజు బెగ్గురు నీరుకాకి కంకణమును
కొంగ దాబయగువ్వ వంగపండు

తే మొదలుగాఁ గల్గువానిని మెదలనీక
కదిసి నున్గోళ్లకొనలను గుదిచి పట్టి

పొదలుచును తేనిమదికి నింపొదవఁజేసె
నెలమి నప్పుడు విడివేఁటపులుఁగు లెల్ల. 24

తే. అంత నా రాచవేలుపుహాళి యొఱెఁగి
కడిమితోడుత నవ్వేఁటకాండ్రు కడఁగి
పొడవులైయుండు తెఱలెత్తి పోఁగుదీర్చి
బలు మెకంబుల వలలందుఁ బడఁగ నార్చి. 25

క. పిడుగులచప్పుడువడువునఁ
గడురొప్పెడు మెకపుగద్దికల కలుకకయే
కడలవెడలంగ నీయక
పొడువఁగ నావవలి నింగి బోరుకలంగెన్. 26

శా. రాజందన్ బలుపైన వేఁటతమిచే రాగిల్లి కెంగేలిపై, నేజా
ద్రిప్పుచు లాగి వాగె బలిమిన్ దేయంచు నొక్కుమ్మడిం,
దేజీఁ దోలిన ముందువెన్కరుగ కెంతే బీతులో బ్రుంగి తా,
మేజాడం జనఁగా నెఱుంగ కొడిఁగెన్ హెచ్చైచ్చు మెకంబు
లెవ్వసన్. 27

వ. ఇట్లు గాలిం గేలిగొను నురవడి మెఱవడి గారవంపు వారు
వంబు నదలించి తెరలోనికిం గదలించి. 28

క. పొడిచిన నేజా వెంటనె
వడిఁ బైకొని చొకళించి వచ్చినపులుల
న్నెడలెడలించెను బెడిదపు
టడిదంబున నేల గప్పినట్టుగ నుండన్. 29

క. ఆపగిది వ్రేసి యుడుగక
యేపున సింగిణికి నారి యెక్కించి వడిం

గోపుల బెబ్బులులం గని
తూపులకు న్వానినోళ్లు దొనలుగఁ జేసెన్. 30

మహాస్రగ్ధర. అనుకుంజాపు ల్దగం దా మదుగులు పుడమిన్
హాత్రనీకేగు లేళ్లం, గని తేజీఁ దోలి యంటం గదుముచు
మెఱుఁగుల్ గ్రమ్ముచుండంగ మున్నే,సినతూపు ల్వేండి
యొంటం జెలఁగుచుఁ దునుకల్ చేసి చేనేర్పుమీఱం, దన
వాలుంగంటికన్నుల్ దలఁపుచు మదిలో దాఁచియున్నట్టి
కూర్మిన్. 31

స్రగ్ధర. తుండించె న్స్నుఁబిళ్లం దునిమెఁ గణుదులం ద్రుంచెఁ
జివ్వంగిమూఁకం, జెండాడెం గొండగొర్లం జెలిగె నెలుఁగులం
జించెఁ గార్ణ్పోతుల న్మై,కండల్గాఁ జేసె నిర్లం గలఁచెఁ జిఱు
తలన్ గండ్రికల్ చేసి నేల, న్నిండించెన్ దుప్పులం బన్నిద
మున శొకటి న్గ్లోకయుండంగ నచ్చోన్. 32

క. ఇటువలె వేఁటాడెడుతఱిఁ
దటుకున నొకయిఱ్ఱి తెరలుదాఁటి వడిం జెం
గట నుఱుక నెఱుకుదొరలా
ర్పుటయున్ తేఁడలుక దానివొప్పున నొంటిన్. 33

వ. చనం జన ముందట. 34

సీ. చల్లనితలఁపుటాబల్ల మీఁదటఁ జిల్ల
జీర్కులాడెడు వేల్పుఁజేడియలును
దమపాటఁ గరఁగు నిద్దపుటాలునీటనం
దఱునోలలాడు కిన్నరులగములు
గవులజేజేనన్పు కాంద్రతో వలరాచ
మచ్చికఁ బెరలాడు నచ్చరలును

బచ్చలగనులపైఁ బసిమి పచ్చికయంచు
వడి మేయవచ్చిన ఫ్రదుకుఁబసులుఁ

తే. గెంపునెలవులుగాంచి యుంకించి తమ్మి
కొలఁకు లని వచ్చి కాకున్నఁ గలఁగి యపుడు
మగుడ నేగెడు నంచలఁ దగిలిపట్టి
మెలఁగు తెఱగంటి కొమిరెలుఁ గలిగి మఱియు. 35

సీ. బెట్టుగా నడివంకఁ జుట్టివచ్చిన మబ్బు
వెలయు నేనికతోలు వలువ గాఁగఁ
బైనుండి క్రిందికిఁ బర్వుజేగుఱుటేఱు
లోడలప్రేలెడు పల్లజడలుగాఁగ
నెత్తంబుక్రిందటి నెత్తమ్మికెంపుటా
గని పెంపు వేలిమికన్నుగాఁగ
ననయంబుఁ దొరఁగి పేరినమంచు వెన్నెలల్
చిలికెడు నెమ్మేని తెలుపుగాఁగ

తే. నెపుడుఁ బాయకయున్న మిన్నేఱు దనరఁ
బేర్మిగొండలఱేఁడను పేరు మెఱయ
వేల్పుమలవింటిదేవర పోల్పుదాల్చి
జన్నపుండిండివిడిమట్టు చలువగట్టు. 36

ఉ. మించినయాముటేనుఁగుల మీఁదికిఁ జెంగున దాఁటి యా
దలల్, చించిన గోళ్లలోఁ దవిలి చిందిన ముత్తెములెల్లఁ
జట్లపై, మంచునఁ బేరి దాకొనిన మాటికి నమ్ములఁ ద్రవ్వి
ద్రవ్వి య,చ్చెంచునెలంత లేఱుదురు సింగపుఁజాడ లెఱింగి
యచ్చటన్. 37

క. వలిగాలి నెలుకుబిడ్డలు
నెలవులకడ కెంపుటాలు నిప్పుక లనుచుం
జలిగ్రాఁగఁగ వత్తురు త
ల్లులచంకలు డిగ్గి నిచ్చలుం దగ నచటన్. 38

ఉ. విన్నన నేగుతామరలవిందుకిలాతపు నీడ లెప్పుడున్
వెన్నెలరాచటాలఁగని వెళ్లక నీళ్లమునింగి యున్న వీ
మన్ను లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ములనేసి నాటమిన్
మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁబోవుదు రిండ్లపట్లకున్. 39

వ. మఱియు జూఁకఱమరులుగొలుపుచు మరునియురులసరులై
యిరులుకొను కఱకుఁజూలుకుఁజూపుల కోపులవలపులు గొ
లుపు నెలుకుటిలుకుగుబ్బెతల విప్పఁగప్పఁగొప్పులయొప్పులు
గని తెమలి నెమలిపించంబులనుచు వెఱచి పఱచి యందపు
గందపుమ్రాఁకులమోకలఁ బెట్టుఁ జుట్టుకొను చిలువలతలల
మినుకులకునుకు లగుమానికంబుల రంజిలు కెంజాయ చిగు
రని పొగరున నెగిరి వచ్చు కోయిలలును వడివడి మీఁది
కడ నడరుచు బీరపుఁగుప్పలై తిప్పలసం గొప్పలగు దుప్పు
లకుం గాక బెగ్గిలి నేలకు డిగు పెంజిలువలుం బోలె మలల
చఱుల మలకలై జాఱుసెలయేఱులును జలువ నెలవు లగు
కలువరాచటాచలుకలపై వలపుతోఁ బడుకొలఁకుల కెలఁ
కులం దగు మొగిలు తెరల యొగలనుఱుంగునం గరంగుచు
మగువల బిగువుఁగవుంగిళ్లఁ జొక్కు జక్కవలపెక్కువ
లును ముసువులై సింగంపు జంగిలి కరవులై విరువులగు
నరవలం గరువలిమేపుడు దొరపడగలపై నిగుడు సొంపు
లగు కెంపుల రంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన

మించు తలిరుమ్రాఁకులునుం గలుగు నగ్గుబ్బలి సోయగంపు
టుబ్బునకు మై నిబ్బరికింప నబ్బురపడి యబ్బలియుండు
తనలోన. 40

మత్తకోకిల. నీటి పుట్టుగుపట్టి యెన్నఁడు నెమ్మిఁ గానఁగ లేని
య, మ్మేటివేలుపురాయఁ డామరుమేపుకందొర మామగా
నేటి నీటుతనంబు సేసెనొ యీవడంకుమ లంచుఁ దా
మాటికిం గొనియాడుచుం జని మన్నుతేఁ డటనుండటన్.

సీ. ఉబ్బు బుగ్గలు గబ్బిగుబ్బలు గాఁగ బి
త్తర మైన తరగలు తరులు గాఁగ
జాలగు తొగలు ముత్యాలపేరులు గాఁగ
మురువగు వెలిదమ్మి మోముగాఁగఁ
దొరంపుఁదామరతూండ్లు చేతులు గాఁగ
నలతేఁటిచాల్పు నూగారు గాఁగఁ
బలులోఁతుసుడియె పొక్కిలి గాఁగ మిక్కిలి
కొమరైన చిందంబు కటిక గాఁగఁ

తే. గప్పు గల నాఁచు గొప్పైన కొప్పు గాఁగ
మేఁతలిడు నంచ లిరువంక మూతి గఱవ
రాణ దిలకించు పూఁదీఁగె వీణెగాఁగఁ
బలుకు తెలనాఁగయును బోలె నలరి మఱియు. 42

సీ. ఇసుమునఁ గావించి యెఱఁగి జాబిలితాల్పుఁ
దగఁ గొల్చు నజ్జపదారితుటుము
గాలి యోగిరముగాఁగను నీటిలోనఁ ద
బము లొనర్చెడు నిరాబారిగములు

నేచవు ల్మను మాని లోచూపుగా మిన్క
కడలఁ దోఁచు వెలుంగుఁ గాంచు వారుఁ
గ్రుంకి యానీటి కెలంకు లందును వన్నె
మ్రుగ్గువెట్టెడు వేల్పు ముద్దియలును
తే. బసిఁడి వేఁడెడువారికి నొసఁగ వచ్చి
దరుల నిల్చిన జేజేలదొరలుఁ గడల
నడవిపసుపులు మెదిచి పైనలఁదు తబిసి
కన్నియలపిండు నెంతయుఁ గలుగుదాని. 43.

సీ. తులకించు వేలుపుదొరలకేళాకూళి
పసిఁడి కెందమ్ముల పంట చేను
జొట్టు నట్టువ తేజిజోదుఁ గాంచిన దంట
సగరు వేగిననాఁటి మురితిత్రోవ
బెడిదంపుజడదారితోడఁ దూఁటినవలంతి
నలువ వారువములు చెలఁగుచోటు
జగములు మూఁటిపైఁ జంగ జాఁచినతాఁగ
నుడుగుల చెలిమామయడుగుఁ జెమరు
తే. సరగఁ దనుఁ జూచు వారి కెవ్వరికి నైన
మలబిడారును పులకల నలరు పేరుఁ
బంట తేరును వేలిమికంటి తీరు
నొసఁగు ప్రోడయునై చాల నొనరుదాని. 44

క. రంగుగఁ జూపఱకోర్కు లొ
సంగఁగ దోసంబు లడఁపఁ జను దెంచిన యా
గంగం గని మై యెల్లను
బొంగం దగ మ్రొక్కి రాచపుట్టువు మదిలోన్. 45

సరసిజవృత్తము. కప్పఁగఁ దోలుం గొప్పున ఫాలుం గనువిను
కులనొడికము లగుసరులుం, దిప్ప బిడారుం ద్రిప్పని తేరుం
దిరముగఁ జదువులు దెలిపెడి తెవెయుం, గప్పగుతూపుఱ్
గొప్పగురూపుం గడలిని దఱదఁగఁ గలిగిన పువ్వుం, దప్పక
యిచ్చు న్విప్పుగ మెచ్చుం దను నటు పొడఁగనఁ దడవెవ్వ
రికిఱ్. 46

వ. అని యమ్మున్నీటిరాణిచెన్ను మాటికిం గొనియాడుచుఁ
గొంతద వ్వారిగి యచ్చట.

తోదకము. మావులుఁ జిన్నలు మాదిపలంబుల్
క్రోవులుఁ బొన్నలు గోఁగులు నిమ్మల్
మోవులు రోపులు మోదుగు లొద్దుల్
రావులు నిప్పలు రాణ దలిర్పఱ్. 47

సీ. మదిఁ గూర్మ లుప్పొంగ మొదవు బాలెంతల
పురుడోము ముదుసలిపులులకదుపు
బలుదాదులగుచు బెబ్బులిబిడ్డలను నిచ్చ
విసువక పెంచు నాఁ బసులకదుపు
లెలమి ముంగిసపిల్ల లెండ దాఁకకయుండఁ
బడగ లడ్డముపట్టు పాఁపగములు
నెలికపూపల వీఁపు లెక్కించుకొని సారె
నలరించు జంగుపిల్లలతుటుములుఁ
తే. జేరి సింగంపుఁ *బిల్లల చెమటలాఱఁ
జెవుల విసరెడు నేనికచేడియలును
గొరు లామున నొడ లెఱుంగమిని జూచి
మేఁత లందిచ్చు తెఱనోటిమెకము లదరు. 48

---

*కొదమల-పాఠాంతరము.

సీ. ఆఱఁగట్టిన కావిచీరలకెంజాయ
చిగురుజొంపంబుల చెన్నుఁ బెంప
నోలి నిచ్చలుఁ జేయు వేలిమి పొగలు తు
మ్మెదదిమ్ములకు రంగు లొదవఁజేయఁ
దులకించు మూఁడవ తొలిపల్కు రవలి కో
వెలకూఁతలకు నొక్కవింత నెఱప
ముంగిళ్ల బాసవా ల్ముద్దియ లిడిన మ్రు
గ్గులు పువ్వులకు నిండుతెలివి నింపఁ

తే. గలుగుమ్రాఁకులు జన్నంపుఁగంబములును
దడఁబడంగను దగు నొక్కతబిసితోఁటఁ
గాంచి యబ్బురపడి కోర్కిగడలు కొనఁగ
రాచవేలుపుతేఁడు చేరంగ వచ్చి. 49

సీ. పటికంపుమురువులు, పాఁకోళ్లు లటంచుఁ
జిలువలతేండ్లు చేతులఁ బెనంగ
జడలలో నిండ గూండ్లిడినపుల్గుల మ్రోఁత
చెలఁగుచు నల్గడల్ చెవుడు పఱుప
గమిగూడి నరపగడ్డము వట్టి వ్రేలుచుఁ
జింకిలికంబులు చేరియుఱుక
బెట్టుగా మైనిండఁ బెట్టిన చెదలకై
గొఱవంక లెప్పుడు గోళ్లఁ ద్రవ్వఁ

తే. బ్రాఁతచదువులతుదల నేర్పడినమెఱుఁగు
మదిని గనుఁగొంచుఁ దా వెలి మఱచి కడిఁది
దబము గావించు జాబాలిదండ కరిగి
ముందఱికి నేగి సాఁగిలి మ్రొక్కుటయును. 50

వ. అప్పు డాచప్పు డాలించి. 51

తే. అల్లనల్లన కనువిచ్చి యతనిమేని
సోయగంబును బీరంబు చొప్పు మురువుఁ
దడవుగాఁ జూచి మదిని సంతసము గ్రమ్మ
నపుడు జడదారిరాయఁ డిట్లనుచుఁ బలికె. 52

క. అన్నా నీవే రెవ్వరు
నిన్నుం గనుఁగొన్న నహుషునిం జూచిన య
ట్లున్నది యీ రావేలుపు
గన్నకొమారుఁడవె నీదుకై వడి దోఁచెన్. 53

చ. అనవిని రాచవేల్పు దొర యాయనఁ గన్గొని కూర్మి నెమ్మదిం
బెనఁగొన నయ్య నే నహుషుబిడ్డఁడఁ బేరు యయాతి
వేఁటకో, పున నవరించినం దెరలు బోనులు గైకొనకొక్క
యిట్టె వచ్చినఁ జను దెంచినాఁడ నవి చేపడునోయను హాళి
తోడుతన్ 54

వ. అనవుడుఁ జెరువం దగినయొకం బుషిమిత్రుం బొప్పుండ
నేమించి గారవించి యి ట్లనియె 55

క. రక్కసులు వేడబంబుల
మిక్కిలి నాముకొని కొట్టుమిట్టాడంగా
నక్కట యొకమెకమునకై
యిక్కానలనొంటిఁ దిరుగు టిది తగవగునే. 56

క. మును పోకరక్కసి మెకమై
తన ముందఱ కేగుదేర దాని వెనుకఁ దాఁ
జను దెంచి కాదె రాముఁడు
నను వేదుచు మోసపోయి యలజడి పడియెన్. 57

ఉ. నావుడు నయ్యయాతి మదినాటినప్రేముడి ముజ్జగంబులం
బ్రోవఁగఁ గావ బీరమునఁ బొల్పగు రాముఁడు నట్టిబూ
మెచ్చే, నేవగ మోసపోయె నతఁడేమిటఁ దాఁగడ తేత
నాకునో, దేవర యానతీవలయుఁ దేటపడ న్వీన వేడుక
య్యెడున్. 58

వ. అని యడుగుటయును. 59

జాబాలి రామాయణకథ యయాతికిఁ జెప్పుట.

చ. అలరఁ బులస్త్యునుద్దుకొడు కైతగు విశ్రవసుండు రావణుం
బెలు చగుకుంభకర్ణుని విభీషణుఁ గాంచిన వారు మీఱిచే
బలువునఁ నెల్లెడ ల్గెలిచి పైఁడిదొరం దెగి పాఱఁ ద్రోలి ని
చ్చలమునఁ దావిగట్టుకడ సంద్రములోపలిదీవి యేలుచున్.

క. ఎనలేనికడిమి పెంపున
ననిమీఱిన యింద్రజిత్తు నతికాయుని న
క్షుని ద్రిశిరుఁ గాంచె రావణుఁ
డనయంబును జగము లెల్ల నలజడిఁ జెందన్. 61

శా. ఇట్లట్లెందును బోవరాక వగతో నెల్లప్పుడు న్వేలుపుల్
వెట్టం గొట్టమునేయ మత్తిలి వడి న్వెన్నేటికాల్పున్న యా
గట్టున్ బిట్టుపెకల్చి రావణుఁడనంగా మీఱి రాకాసి పెం
బట్టం బేలె నతండు తమ్ముగవ యెప్పట్లం దనుం గొల్వఁగన్.

వ. ఇట్లెందును నెదురులేక యతండు లెక్కకు మిక్కిలి యగు
రక్కసిమూఁకల ప్రేఁకంబులతో జగంబులు వగలం బొగుల
నెట్టికొని కుతిలవెట్టుచు నొక్కనాఁడు. 63

క. అలవోకయుఁ బలె జేజే
నెలవుపయిన్ దాడివెట్టునిగఁ దనబంట్లం

బిలిపించి సొంపుపెంపున
జెలఁగుచుఁ బయనంపుఁదమును జేయించుటయున్. 64

శా. రాలెం జుక్కలు గుబ్బలు ల్వగిలె సంద్రంబు ల్గలంగె న్వడి
న్నేలం గుమ్మరి సారి పోల్కిఁ దిరిగెన్ బ్రీ లెన్ దెస ల్బీతుచేఁ
దూలె న్వేలుపు లెంకి పాఁపనెలవుం దోడ్తో వెతంబొందె వే
జాలిం జెందిరి బేసికంటిదొరయున్ సైరింప కావెన్నుఁడున్.

వ. ఇట్లు తమును సేయించి కడిమిరక్కసుల పెక్కువల బెడిదం
పునడకం బుడమి గ్రక్కదలఁ గదలి చని వెండికొండ కెలం
కుల మొనలు విడియించె నప్పుడు. 66

సూర్యాస్తమయవర్ణనము.

తే. సరగ మిన్ననుకమ్మరి సంజకొలిమి
బెట్టుగాఁ గాల్చి బంగారు చుట్టువాలు
పదనువెట్టఁగఁ గొనిపోయి పట్టలేక
విడిచె ననఁ బ్రొద్దు పడమటికడలి మునిఁగె. 67

క. కడకడలి వేఁడివెలుఁ గను
జడదారి వడి న్మునుంగఁ జని జేగుఱుప
చ్చడ మాఱఁగట్టెఁ దరి ననఁ
బడమట నెఱసంజ నిండె బలుపుగ మఱియున్ 68

సీ. పూనికఁ దగునీటి తేనిపసిండియు
ప్పరిగె వాకిటి తోఁపు తెర యనంగఁ
గ్రుంకు మెట్టునవేల్పుఁ గొమ్మ లాడుచుఁ జల్లఁ
దులకించు చెంద్రపు దుమ్మనంగఁ
గడుసొంపుచే నొప్పు పడమటిమలమీఁది
తెఱులందుఁ గెంపులచాయ లనఁగఁ

దమినాడు తెఱగంటికొమరులు గావింపఁ
బొలుపొందు పగడంపుఁబలుక యనఁగఁ

తే. బ్రొద్దువాసినవంత లోఁ బొడముచుండ
మునుఁగు కెందమ్మిరేకులమూఁక యనఁగ
విరియు చెందొవననలకు వెన్న పెట్టి
నిండె నెఱసంజ కన్నులపండు వగుచు. 69

వ. అప్పుడు. 70

సీ. నింగివేరింటి మున్నీటిలో నప్పుడ
పొడమిన బెడిదంపుబుగ్గ లనఁగ
నాకసం బను మ్రానియందు నొక్కుమ్మడిఁ
బూచిన తెలిచాయపువ్వు లనఁగ
మి న్నను కొలనిలో మెఱుఁగెక్కి విరియుచుఁ
జిగినుల్లసిల్లెడు తొగ లనంగఁ
జద లను నల్లపచ్చడముపైఁ బచరింపఁ
దిలకించు నాణెముత్తెము లనంగఁ

తే. గదిసి వలరాచమేపుడుఁగంటివేల్పు
జడలలోనుండి వడియుచుఁ గడితపడిన
తేటవేలుపుటేటిపెన్నీటిబొట్టు
లనఁగఁ జుక్కలు గనుపట్టె నలరుఁదెలివి. 71

చ. తలఁప ననుంగులైన యలతమ్ములలోపలి తేఁటిగాక తా
వెలికెట కేగఁగాఁ గలఁడు వేఁడివెలుం గని పేర్చి యార్పు
చుఁ, సిలుఁగులఁ బెట్టఁగా వెదకు చీఁకటి సోఁకుడు పిల్ల
లో యనం, గొలఁకులఁ ద్రిమ్మరం దొడఁగెఁ గూఁర్కక
మ్రోయుచు గండుఁదుమ్మెదల్. 72

క. తమ్ములు మొగిడించినఁ దమ
కొమ్ములలోఁ జిక్కి నిక్కి కూరిమిఁ జుట్టుం
ద్రిమ్మరు మగతుమ్మెద లా
నెమ్మది వగ గాకయున్నె నెలఁతలఁ బాయన్. 73

క ఇరులు బలియుచును వలకుల్
కరమరుల్లై కరుడుకట్టి కదిసినకరణిం
బరఁగఁగఁ దోఁచుడుఁ గాటుక
కరవటముంబోలె నిజ్జగంబు దనర్చెన్. 74

తే. పూని పదిరెండుప్రొద్దులుఁ బొడిచెనేని
యిందులోఁ గానవచ్చునె యించుకైన
ననఁగఁ గలిగిన వన్నియ లలమి తనదు
రూపుగా మీటి చీఁకటి యేపు చూపె. 75

తే. తనకుఁ బగయగు ప్రొద్దున వెనకి కనక
కనలు చీఁకటిరక్కసికన్నులందుఁ
దొరుఁగు కణకణమను నిప్పుతునుక లనఁగఁ
బొలిచె నెడనెడ మిణుఁగుఱుఁబుర్వు లంత. 76

క. వెలిచాయ దోఁచెఁ దూరుపు
వలనం దగఁ దమ్మివిరులు వాతులమూయన్
నెలచూలన వెలవెల నగు
తొలుకడ యను నెలఁతమొగము తోరపుజిగిగాన్. 77

క. కర మలరెఁ దూర్పుమలఁ
జందురుఁ డాదట నిర్గసోఁకుఁ దునుముటకై వే
గిర మాకసంపుఁగటిదే
వర పంపిన కెంపుఁజుట్టువాలుం బోలెన్. 78

తే. వీణె యక్కున హత్తించి విన్ను నాఁగ
వఱలు వెన్నుని గొలువంగ వచ్చు చివ్వ
కూటితవిసియు బలెఁ గందు గొనబు మీఱఁ
జందురుం డల్లనల్లనఁ జదలఁ బ్రాఁకె. 79

క. ఆతఱి వెన్నెలదగు రు
జ్జాతా జాబిల్లి వెజ్జు జనమున కెల్లన్
రాతిరి సోఁకిన చీఁకటి
బూతము విడువంగఁ జల్లు*బూతియుఁ బోలెన్. 80

సీ. †వేల్పురాయఁడు దన వెలిమావుఁ దెలిగారు
నీగిమూఁకులఁగాన కెదఁగలంగఁ
గటిమేనివాఁర పాలకడలిఁ జిల్వలతేనిఁ
దెలిదీవిఁ గనలేక తిరుగుచుండ
ముక్కంటి వలిగట్టు నిక్కమెట్టును నాల
పోతుఁ గానక చాల బీతుకుడవ
నలు మొగంబుల మేటి పలుకుఁదొయ్యలి నంచ
వెలిమేనిగొడుకును వెదకఁబోవ
తే. నన్ని రంగులు తనరంగు లై తలిర్ప
నిగిడి తెలిచాయ వెల్లియై నిండె ననఁగ
నిక్కి జగముల నెల్లను బిక్కటిల్లి
నిలిచి పొంగుచుఁ బండువెన్నెల దనర్చె. 81

వ. అప్పుడు. 82

---

* బూతియనంగన్—పా.

† ఈపద్యములో "మహారాజ శ్రీమాన్ జగతి యశసా తే ధవళితే" అను శ్లోకమునభిప్రాయము నిమిడ్చెను.

సీ. అనుకువెన్నెలఁ దాల్చి తునిచి సేవెలుచేసి
వెన్నెలపాలను జున్నొనర్చి
గట్టివెన్నెల పిండిగొట్టి వెన్నెలవెన్న
గలయ వెన్నప్పాలుగా సమర్చి
గడితంపువెన్నెల గండ్రికల్ సిగరిగాఁ
డియ్యవెన్నెలలోనఁ దెచ్చిపెట్టి
యెడల వెన్నెల చక్కెరిడి జోర్కు వెన్నెలఁ
బూనికనాళీలుగాను గూర్చి
తే. పండువెన్నెల యను వెండిపళ్లెరములఁ
జెలఁగి యిల్లాండ్రు వడ్డింపఁ జెలులుఁ దాము
వేడుకలు మీఱ బువ్వంపుఁగూడుఁ గుడిచి
పొదలు తమితోడ వెన్నెలపులుఁగు లమరె. 83

వ. అప్పుడు. 84

క. బలు వెనరైనవి గూర్పఁగఁ
బొలి వోవని లేఁతపాయపుం బొగరులతోఁ
దలిమను లెక్కిడి వెన్నెల
పులుఁగులఁ గని తనదుమదిని బొదలు పిరాలిఁ. 85

వ. వలరాజు పూఁదూపుల కులికి వేలంబు వెలికిం జని
రావణుండు భ్రమ్మరునట్టియెడ. 86

రావణుఁడు రంభను గాంచుట.

సీ. కస్తూరి మొదలుగాఁ గలపంబు చేసిన
గందంబు నునుపూఁతగాఁగఁ బూని
వెన్నెలపొరవంటి వెలిపట్టు ఫలికంబు
జిలుఁగుఁబావడ మీఁద నలవరించి

వేలుడుగాఁ దీర్చి కీలుగంటునఁ గ్రొత్త
చనుపకంబుల సరుల్ పెనఁచిచుట్టి
పసిమి సుప్పాంగు మట్టసపుసొమ్ములతోడ
నాణిము త్రైపుఁజేరు లసువుపఱిచి
తే. యందియల మ్రోఁత చెవ్వులకు విందుసేయఁ
జదలనెకసక్కెమాడెడు సన్నగౌను
బిగువుఁజన్నుల వ్రేఁగున బెగడు గుడువ
మరుఁడు దోడుగఁ జనుదెంచు మగువఁ గాంచి. 87

తే. వడివడిం జని యాతఁడో వాలుగంటి
నీదు పే రేమి యెవ్వఁడు నీదుమగఁడు
పూని కాందారిమాం దారిఁ బ్రొద్దుకడను
నెందుఁ బోయెదు తలిదండ్రు లెవ్వ రనిన. 88

ఉ. రక్కసిరాయ యే వినుము రంభను మిక్కిలి నన్వికత్తెనై
జక్కులతేనిపట్టికిని జవ్వన మంతయు జన్నెగట్టి రే
యొక్కతె నుండలే కతని యొద్దికిఁ బోవుచునున్నదాన నే
నక్కడలిం దగం గలుగు టంతయు విన్నదె చెప్పనేటికిన్.

క. తడవయ్యె నాకుఁ బోవలె
విడవయ్య తలంపు లోరుల వెలయాండ్రపయిం
బడిపట్టఁ దగవుగా దిది
సడిసేగియు వచ్చు వేల్పుసామికి నైనన్. 90

తే. అనుఁడు రక్కసిరాయఁ డోయతివ జగము
లన్నియును బంపు సేయంగ నున్న నన్ను
రావణునిగా నెఱుంగవో నీవు తమిని
నెఱిఁగి తేనియుఁ బలుకుదే యిత్తెఱుఁగన. 91

